# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

నవంబరు 1958

సంపుటము 35 : : సంచిక 11

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## నవంబరు 1958



1893 నుంచి జలుబులకు

# అమృతాంజనము

ఇప్పటికి మూడు తరాలనుండి
అమృతాంజనం జలుబులనుండి
శీఘ్రమైన విముక్తికోసం
వాడబడుతున్నదని అంద
రికీ తెలిసిన విషయమే




అమృతాంజన్ లి., మద్రాసు 4 మరియు బొంబాయి 1, కలకత్తా 7.

AL.37.3 TEL

ప్రతి ఆదివారం రాత్రి 6-30 గం॥ లకు 41 మీటర్ల మీద రేడియో సిలోన్‌లో దక్షిణ భారతభాష
ల్నింటిలో వెలువడే ప్రోత్సాహక కళాకారుల ప్రోగ్రామ్, అమృతాంజలి వినండి.

# మహాత్మ స్మృతి

శ్రీ కందుకూరి రామభద్రరావు

ఓయి మహాత్మ! నీవొక మహోన్నత పర్వత రాజ మట్లు, భ
ద్రాయితమూర్తివై భరతధాత్రిని నిల్వఁగ, సర్వమానవుల్
పోయిన సత్తువల్ తిరిగి పొంగులువెట్ట, భవత్ప్రబోధనం
ధాయిత చిత్తవృత్తుల విదల్చిరిగా పరదాస్యశృంఖలన్.

కోసినో రొక నవ్వుపాల్పు వెలార్చినా
పండు వెన్నెల మొదల్ నిండిపోయె
పల్కులు జడిగట్టి పైకి వర్షించినా
అమృత ప్రవాహంబు లంత బారె
కరుణాకటాక్ష వీక్షణములు పరగినా
సంతప్త హృదయవసంత మొనఁగె
ధైర్య హేమాచల దర్శనం బబ్బినా
మంటి ముద్దల వీరమణులు పుట్టె

అవని పులకింప నీవొక్క యడుగుపెట్ట
మానవాంభోధి జయఘోష మారు మ్రోఁగ
ధర్మ సంస్థాపనార్థ పథంబుపట్టి
పుడమి మెట్టిన యవతారమూర్తి వీవు.

ప్రేమకు వచ్చె నీయెడద పెంపునఁ గోయిల నవ్యకాంతి, నీ
నేమపు బాటలో నలిగి నిష్ఠయె నూతన పుష్టిగాంచె, గా
రామున నీవు కేలొసఁగ రాచరికంబు వహించె శీల, మే
మేమొ వెలుంగు గుంపులకు నేలిక లయ్యె భవత్కటాక్షముల్

శిథిలపర్ణకుటీర చిరనిరంతరదుఃఖ
ఖిన్నుల కన్నీరు కేలఁదుడిచి
పరదాస్యశృంఖలాబద్ధ నిస్పృహులకు
హృదయగహ్వర తేజ మొసగఁద్రోచి

## తారక

అజ్ఞాన తిమిరసీమాంతరాంతరముల
మినుకు దివ్వెలు నిల్పి మేలు కనిపి
రక్తసంసిక్త సామ్రాజ్యరాక్షకరాం
భోజముల్ ప్రేముడుల్వోసి కడిగి

సభ్యనాగరక ప్రసన్నతలనడుము
తొలగు జీవితమూల్యంబు నిలుపబెట్టి
చన్న నీ స్థితప్రజ్ఞకు స్తవనమిడ
నరుల గుండెలలో కృతజ్ఞతలు దక్క

కానియు లేదు నీకయినఁ గాంచన వర్షము నీయధీన, మె
ద్దానికి లేదు నీవిభుత, కాల్చె ప్రభుత్వము నీదు నాజ్ఞ, లీ
మానవకోటికిన్ శిరసు మండన మయ్యె భవచ్చరిత్ర, వ్యా
ఖ్యానము గీతకున్ బ్రదుకు, కారణజన్ముడవయ్యె ధాత్రిపై

తూరుపుద్వారమందుఁ బరితోషణ తోరణకాంతిపుంజముల్
దీరిచి, మంగళధ్వనులు దిక్కుల బర్వ స్వరాజ్యలక్ష్మికిన్
భారతనారులు న్నరులు పట్టముగట్టిరి పండువృద్ధవై
వారలనమ్రశీర్షములపై వెదజల్లితి మందహాసముల్

పిచ్చికిగూడఁ గొంతగ వివేకము కన్పడు, బుద్ధి యొంతక
మ్మెచ్చున లాగినన్ విడదు మీమహిమోజ్జ్వలమూర్తి లోపలన్
చిచ్చుఱరవ్వలన్ బఱప చేయెటులాడెనో! గుండెనెట్లెనో!
చొచ్చె తమస్సు నీ వరుగ, శోకము నిండె సమస్త లోకమున్.

మానవమనోంబరంబున మార్గదర్శ
కంబుగ వెలుంగు ధ్రువతారగా మహాత్మ!
పలు శతాబ్దులు నిల్చెదు, పాశపద్మ
ములు మొగిడ్చి నమస్కృతమునుఘటింతు.

## స్వర్గీయ శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ

చేయించాలి. ఆ రెండు విషయాలు అనుక్షణం లక్ష్మీనారాయణగారి దృక్పథంలో ఉండేవి. ఎప్పుడు వాటి విషయమే చర్చిస్తూ ఉండేవారు. వారు బ్రతికి ఉండగానే ఆంధ్రరాష్ట్రము, సంపూర్ణాంధ్ర రాష్ట్రము సిద్ధించాయి.

కాని స్వాతంత్ర్యోద్యమంలో ఎత్తిపోయిన రైతుల సమస్య, ఆఖరి క్షణంవరకూ వారి దృక్పథంలోనే ఉన్నదని చెప్పక తప్పదు. గత సంవత్సరంలో కూడా ఆయన రాజకీయ బాధితుల సమావేశానికి అధ్యక్షత వహించారు.

ఉన్నవ లక్ష్మీనారాయణగారు స్వర్గస్థులైనారు. నిజంగా అటి వ్యక్తులు మరణిస్తారా? కాని నేడు వారు కీర్తిశేషులై అయినారు. వారు రచించిన కొన్ని ఉద్గ్రంథాలు, వారి స్మృతి తప్ప మనకేమి మిగలలేదు.

ఉన్నవ లక్ష్మీనారాయణగారు ఒక ప్రత్యేక లక్ష్యంతో జన్మించిన మహావ్యక్తి అనడంలో అతిశయోక్తి లేదు. లోకంలో క్లిష్టపరిస్థితులు వచ్చినప్పుడు మానవులు అంధకారంలో పడి దారి తెలియక సతమతమవుతున్న సమయాలలో ఇటువంటి మహావ్యక్తులు జన్మిస్తారు. తోవచూపి, సత్యమార్గాన నడిపించి మానవుల్ని తరింపచేస్తారు.

గాంధీ మహాత్ముడు తన మహోద్యమం ప్రారంభించే సరికల్లా, లక్ష్మీనారాయణగారివంటి దివ్యమానవులు దేశమంతటా సిద్ధంగా ఉన్నారు. కొండా వెంకటప్పయ్య, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, బులుసు సాంబమూర్తి, టంగుటూరి ప్రకాశం, డాక్టర్ సుబ్రహ్మణ్యం, ఉన్నవ లక్ష్మీనారాయణ మొదలైన మహాపురుషులందరు, గాంధీజీ ఉద్యమం కోసమే వేచి ఉన్నట్టు తోస్తుంది. వారంతా, ఆనాడు తమతమ నిర్ణీత కార్యక్రమాలాదరించి, మన స్వరాజ్యరథాన్ని ముందుకు నడిపించారు. వారంతా అవతరించి ఉండకపోతే మనకసలు స్వరాజ్యమే లభించి ఉండదేమో అని కూడా అనిపిస్తుంది. ఆ స్వాతంత్ర్య యోధులందరూ అమరులు. ప్రాతః స్మరణీయులు. వారికి నా నమోవాకాలు.

సంస్కృత లక్షణములోని వృత్తిగంధి వచనము పద్య భాగబాహుళ్యప్రధానము ఆ పద్యభాగవృత్తియు గణసంఖ్యయు కంటె గురులఘువులు గమనార్హము. వస్తుచోదుని కుమారసంభవములో అట్టి వృత్తిగంధి వచనము కలదు. ఆయా ప్రకరణముల ఆయా ప్రభేదముల వర్ణనములు ప్రకృతము వచనము రీతిపరముగా అసమాసకము, దీర్ఘసమాసకము అని ద్వివిధమున స్పష్టము. వసు పరముగా తెలుగువచనము త్రివిధము 1 కావ్యగతమైన గద్యములు. 2 విప్రకీర్ణకములైన చూర్ణికాదులు 3. ప్రత్యేక వచనగ్రంథములు. అందు మరల అవాంతర భేదములు అనేకము. అది వచనరచనా పరిణామము కలిగి ఫలప్రాప్యము ఏకంబిన్న వచన పరిణామమును సమగ్రాంధ్ర వచన సమీక్షకుడే కర్తవ్యము.

అసలు పద్యముకంటె గద్యము గౌరవప్రదము కాదను దృష్టికలదు. అట్టి భావన అవిచారిత రమణీయమే. "గద్యమ్ కవీనాం నికషం వదంతి" అని ప్రసిద్ధమైన ఆభాణకము "బాణోచ్ఛిష్టమ్ జగత్సర్వ" మ్మని మించిన కాదంబరియు, "దండినః పదలాలిత్య" మ్మనిపించిన దశకుమార చరిత్రమును వచనకావ్యములే, గద్యగ్రంథములే. పాశ్చాత్యులకును వచనము పరమ ప్రమాణమే 2 ఎలిజబెత్తు కోర్టులోని ఫిలిప్ సిడ్నీ పద్యకవితకు ప్రతిభటత్వము వహించినది వచనరచనములో మహాకవులు కలరనియే "ఛందస్సునకు ఉచితము కవిత ఉండవచ్చును" అనియే కాలరిడ్జి అభిప్రాయము "కావ్యమునకు ప్రకృతిలయ వలన కలుగు నిశ్చితత్వము (Certainity) శక్తిమత్త్వము (Force) నియమిత్వము (Regularity) అను గుణత్రయము పద్యబద్ధమైన కావ్యములలో స్పష్టీకృతమై, హృదయస్పందకము లైనట్లు వచనములో కుదరదు" అని మేథ్యూ ఆర్నాల్డు వక్కాణించినప్పటికిని "వచనములోను ప్రకృతిలయలు కలవు" అనియే కడ్డీవాదము. గద్యముకంటె పద్యము గంభీరమన్నది షిల్లర్. అతడు మొదట నాటక కావ్యము గద్యములో వ్రాసి తరువాత పద్యములో వ్రాయగా భావనాభేదమున గద్యరచనము నీరసమని పించుటేగాక పద్యరచనములో ఆత్మికసనము కలదని తెలిపిన తదుధికుకని. కాని ఆంగ్లేయకవులు మాత్రము ప్రకృతిలయాత్మకమైన వచనములో రసప్రసరమైన రచనము చేసి "పండితోః సముదర్శినః" అను ప్రవచనమును అన్వర్థము చేసికొన్న అపర్వకవులు. "పద్యగద్యమయం చంపూరిత్యభిధీయతే"—పద్యగద్యాత్మకమైన చంపూ రచనము ప్రత్యేకాంధ్ర సంప్రదాయము. కారణము సంస్కృత చంపూకారులయిన అనంతుని (భారత చంపువు) లక్ష్మణకవి (చంపూరామాయణము) ఆంధ్రులగుటయే. కాదంబరి దశకుమార చరిత్రలతో పాటు తిద్యంపూగత మనుసమ మకుటికి ఆంధ్ర సరస్వతీ అధ్యాపకవాణి సంస్కృత వ్యాసముల్లసితమై సహ్యప్రసన్నమతికసిత మైన, విలసిత మైన తెలుగు వాగ్వృత నందనవనములో పద్యలతికలు గద్యగతికములు

తెలుగు ప్రాచీనత్వమే అయినప్పటికిని పాలిచ్చి పెంచినవి ప్రాకృతసంస్కృతములు ముఖ్యముగా సాహిత్యముఖమున ఆంధ్రుల ప్రథమసాహితీ గాథా సప్తశతి ప్రాకృతమే. ప్రాకృతమే శాతవాహనుల కాలమున రాజభాష. అనాటి హాలుని అర్ధాంగి లీలావతికి సంస్కృతమే లీలావిలాసము. ఆ రాణీగారికి జలక్రీడలోను గీర్వాణమే! పాపము, హాలునికి సంస్కృతము పాఠమైనది. పలువులనాడు సంస్కృతము పాలకవ్యవహారభాషయే. మూడవశతాబ్ది శాసనము లందుకు మాదుల. అట్టి ప్రాకృత సంస్కృతముల ప్రాభవమున ఆంధ్రులదేశభాషకు అనునిపాంతు అసలు దేశభాష అనదగిన వాగ్వ్యవహారము ప్రతిభావకు వది ప్రాథమికదశ వాగ్వ్యవహారము వచనైక రూపము ఆ వచనము అలంకారిక రచనమైనపుడే ప్రత్యేక వాఙ్మయప్రాదుర్భావము వ్యవహారదశయందర్థమూనము. వాఙ్మయవచనమునకు వ్యవహారవచనమే ప్రాతిపదిక. ప్రాచీన వ్యవహారవచనమునకు ప్రభువుల శాసనములు కొంతవరకు ఉపాధులు. ప్రజా దైనందిన వ్యవహార వచనమునకు ప్రత్యేకవసతి లేదు. ప్రభుశాసనములందే ప్రజావాణి సక్రుత్రిమథలనము సాధకము. అది వచన రచనా ప్రాథమికదశ. ఉపలబ్ధశాసనములలో ఉన్నది మొదట గద్యము. తరువాతి పద్యము. కాని పద్య కవిత్వము తరువాత గద్యకవిత్వము క్రమపరిణామము నిజమే, శాసనవచనము కవిత్వగచనము కానేకాదు. కేవల పాలక వ్యవహారములోనిది వచనము. శాసనములు వార్తాప్రధానములు. పత్రికలవంటి శాసనములలో ప్రత్యేక సంచికల కవితా నీరాజనముల వలె పద్యముల పల్లవి సంధితము. కనుక శాసనములలో ప్రథమతః

---

(2) అయుద్రిత సాహిత్య విమర్శనము—పింగళి లక్ష్మీకాంతముగారు.

# దివ్య దీపావళి

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య

ఇదిగో! దీపము లెల్ల వెల్గె నిపు డింటింటం గవాక్షమ్ములం
దివ్యతంబైనవి, సర్వమానవ మనో వీథీ సుహృద్భావ గౌ
రవ మవ్యాహత దివ్యదీపకళికాలంకారనీరాజనో
త్సవమై పర్వెను దిగ్దిగంతర పరీత శ్రీవిరాణ్మూర్తికిన్.

ఏ యింట వెలిగిన నేమి యీ దీపంబు
లింటింట నొకకాంతియే రహించె
ఏ చోట బుట్టిన నేమి యీ పసివాడు
సర్వ మానవ సమాజమ్మువాడె
ఏ పాట బాడిన నేమి యీ దినమున
ధ్వనియించు నాత్మతత్త్వం బొకండె
ఈ రోజు నా యింటి ద్వారాలు దెఱతు నా
హూతులకును ననాహూతులకును

రండు! మీ కందఱకు సోదరుండ నేను
వ్యక్తిగతముల్ల నేడు ప్రాపంచికమ్మొ
నర్చి సేవింతు నా జగన్నాథదేవ
పూర్ణ మంగళాలంకృత స్ఫూర్తి మూర్తి!

ఎచ్చట నీదుపుత్రులు సహింపగరాని దరిద్రతాభరం
బచ్చగ మోయుచుం ధన మదాంధులచే నవమాన్యులయ్యు ని
ష్పచ్చరమైన యా బ్రతుకు బాటల దివ్వెలబారు దీర్చిరో
అచ్చటికే జగమ్మును దయాపరతం దరలింపుమా ప్రభూ!

ప్రాయపడ్డారు. ఛాందోగ్యోపనిషత్తు హృదయనిర్వచనం ఈ విధంగా ఇచ్చింది "హృది, అయం, ఇతి, తస్మాత్, హృదయం" ఆత్మ ఇందులో నివసిస్తున్నాడు కనుక హృదయమైనది. ఇది ఒకఅర్థం. మన సప్రాణముల హృదయంలో ఉన్నది కనుక హృదయం ఇది రెండవ అర్థము కఠోపనిషత్తు హృదయంలో 101 నాడులున్నవని, ఇవి శరీరమంతటా వ్యాపించి, శరీరమును నడుపుచున్నవనీ చెప్పుతున్నది ఇవి శరీరమునకు మూలస్థానాలు సూర్యుడు హృదయంలో ఉన్నాడు ఇతని ప్రకాశమే ఇతరత్రా వెలుగునిస్తున్నది తైత్తిరీయోపనిషత్తులో హృదయమును గురించి విపులంగా చెప్పబడినది కంఠమునకు కొంచెము క్రిందుగా నాభికి కొంచెము పైగా హృదయపద్మం ఉన్నది ఇది అధోముఖంగా వేళ్ళాడుతున్నది దీనిలో విశ్వస్వరూపియైన పరమాత్మ ఉన్నాడు. ఈ హృదయం మధ్యలో సూక్ష్మమైన రంధ్రమున్నది. దానిలో పరమాత్మ ఉన్నాడు ఇక్కడ అగ్నిజ్వాల ప్రకాశిస్తున్నది ఇది నల్లని మేఘములమధ్య మెఱయు మెఱుపుతీగవలె ప్రకాశిస్తున్నది ఇది సన్నని కాంతి గలదిగాను, వరిముల్లువలె సూక్ష్మమైనదిగాను స్ఫురిస్తున్నది దీనికి ఉపమానము ఏదిలేదు దీనిమధ్య పరమాత్మ ఉన్నాడు ఇతడే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సమస్తము ఇతడే మహోపనిషత్తులో ఈ విధంగా ఉన్నది.

"సంత్యజ్య హృద్గుహేశానం దేవమన్యం ప్రయాంతి యే
తేరత్న మభివాంఛంతి త్యక్తహస్తస్థకౌస్తుభాః"

హృదయగుహలోని ఆత్మదేవుని తెలిసికొనలేక ఇంకెక్కడో భగవంతుడున్నాడని అనుకునేవారు, చేతిలో ఉన్న దివ్యరత్నమైన కౌస్తుభమణిని వదిలిపెట్టి, సామాన్యరత్నమును వెదకువారివలె ఉన్నారు

మనకు రెండు హృదయాలున్నవి స్థూల హృదయం మొదటిది సూక్ష్మహృదయం రెండవది స్థూల హృదయం ఒకవైపున, సూక్ష్మహృదయం ఇంకొకవైపున ఉన్నది

నేను, నేను అంటూ ఆత్మహృదయంలో పున్నాడని రమణమహర్షి తమ అనుభూతి వెల్లడించారు పరమాత్మ ముఖము సువర్ణమయపాత్రచే మూయబడి ఉన్నది దీనిని ఈశావాస్యోపనిషత్తు ఇట్లా చెప్పుతున్నది 'హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖం' సాధకుడు, ఈ బంగారుపాత్ర తొలగించాలి అప్పుడక్కడ పరబ్రహ్మ సాక్షాత్కరిసంది ఆత్మజ్ఞానస్వరూపి అందుకే ఉపనిషత్తు ఈ విధంగా అంటున్నది

'ఆత్మజ్ఞానస్వరూపి, ప్రాణంలోను, హృదయంలోను ప్రకాశిస్తున్నాడు. కనుకనే పరమాత్మను సచ్చిదానందుడని పేరు వచ్చింది. సత్, చిత్తు, ఆనందం గురు సత్యజ్ఞానానందమయుడు ఆనందో బ్రహ్మ అని ఉపనిషద్వాక్యం అతని దర్శనం వల్ల బ్రహ్మానందం కలుగుతున్నది బ్రహ్మానందం ముందు ఇంద్రియానందము, సూర్యునియందు దీపం వంటిది ఇటువంటి బ్రహ్మానందము, జ్ఞానము, సత్యము హృదయంలో ఉన్నది దీనిని తెలుసుకోలేక, ఆనందం ఎక్కడో ఉన్నదని వెదుకుట అజ్ఞానం సచ్చిదానందుని సన్నిధిలో రెండు లక్షణాలున్నవి 1 జ్ఞానమయము లేక జ్యోతిర్మయము, 2 ఆనందమయము లేక రసమయము ఆనందము లేని జ్యోతి సూర్యుని వంటిది జ్ఞానము లేని రసము చంద్రుని వంటిది సూర్యుడు వెలుతురు ప్రసాదిస్తాడు, చంద్రుడు ఆనందం ప్రసాదిస్తాడు జ్యోతిస్వరూపము రవిని ఆత్మ అనీ, చంద్రుడు హృదయమనీ చెప్పుతుంది

సూఫీలలో 2 రకాలవారున్నారు 1 వేదాంతి లేక జ్ఞాని, 2 కవి సూర్యజ్యోతివల్ల ఆత్మజ్ఞానము కలుగును ఈ విధంగా ఆత్మజ్ఞానం పొందినవానికి జీవితరహస్యములు కరతలామలకము లౌను. వీరిని వేదాంతులంటాము చంద్రుని రసమయతవల్ల, మానసికాహ్లాదం కలుగుతున్నది ఈ విధంగా ఆత్మోపలబ్ధి అయిన వ్యక్తి సామాన్యుల కందని ఆనందమును అనుభవిస్తాడు ఇతనిని కవి అంటాము కవి ప్రకృతిలోని రసమయరహస్యములు ప్రజలకు పంచిపెడుతున్నారు, వేదాంతి ఈశ్వరుని జ్ఞానరహస్యములు ప్రజలకు పంచిపెడుతున్నారు. కవి, వేదాంతి హృదయసాధకులే కవి ఋషిఅని వేదములు చెప్పుచున్నవి హృదయానందుని దర్శించనివాడు కవికాజాలడు పరమాత్మ ఉన్నతి శిఖరము అధిరోహించిన తరిలో అహంత నశించి ఉండును అతని ముంగున్నది ఏకత్వం అంగులల అతను విశ్వమానవుడౌతాడు సమస్తలోకకళ్యాణమే అతని ప్రయత్నం ఆ ప్రయత్నమును కవి తన కావ్యంలో ప్రవేశపెడుతున్నాడు కనుకనే విశ్వశ్రేయస్సుకోరనిది కావ్యం కాదంటారు మహా రచయితమైన వరిగా రదయితే టాల్‌స్టాయ్ మహా నవలాకారుడని అంగీకరించలేము విశ్వసహోదరభావం చూపించలేనివాడు నవలాకారుడు కాదని టాల్‌స్టాయ్ భావము. కళలో ఎంతరసమున్నా, విశ్వప్రేమ లేకపోతే ఆత్మలేని శవంవంటిది. భారతీయ మహాకవులందరూ విశ్వశ్రేయస్సుతోనే కావ్యములు రచించారు వ్యాసవాల్మీకులు మహాతపస్సుచేసి, సత్యదర్శనం పొందారు. వారు దర్శించిన సత్యము, జ్ఞానము ఆనందము తమ మహాకావ్యములద్వారా ప్రపంచమునకు పంచిపెట్టారు

మాదనలుగా పై శ్లోకములకంటెం కవిత్వ స్థాయి కొంత తెలియవచ్చును వరూధిని తిలకించినట్లేమని చెప్పబడ్డది

## షా లటీఫ్

సూఫీతత్త్వం అర్థం చేసుకొనటకు, ఒక సూఫీ జీవితమును క్లుప్తంగా వివరిస్తాను. షాలటీఫ్ సూఫీ భక్తులలో ముఖ్యుడు సూఫీలకు సింధుగళం అటువంటి అక్కడి ఎడారులు ప్రకృతిసంపద సూఫీ తత్త్వం విజృంభించుటకు కారణమౌంటాయి పరిసరాల నుండి వచ్చే యాత్రికులకు, ఇది కేంద్రస్థలం అక్కడి నుండి వచ్చినవారిని, ఇక్కడి వర్తకస్థితులు ఆకర్షించి ఉంటవి షాలటీఫ్ది సింధుగళం ఈయన 1689 సంవత్సరములో జన్మించాడు తండ్రి విద్యాభ్యాసమున కతనిని గురువు కప్పగించాడు గురువు 'అలిఫ్' అక్షరము దిద్దపెట్టి అతనిచేత అభ్యసింపచేశాడు తర్వాత 'బే' అక్షరము వ్రాసి ఉచ్చరింపుమన్నాడు అతడు మాటాడలేదు గురువు కోపంతో, చెయ్యి చేసుకున్నాడు కాని శిష్యుడు లొంగలేదు తండ్రిదగ్గరకతనిని తీసుకువెళ్లి, నీకుమారునికి విద్య చెప్పలేకున్నాను 'అలిఫ్' తర్వాత అక్షరం అనమంటే, అనకపోయినాడని చెప్పాడు తండ్రి జ్ఞాని అర్థం చేసుకున్నాడు 'అలిఫ్' అనగా అల్లా అని అర్థము అలాంటి ఇంకొకటి లేనే లేదు ఉద్దేశంతో రెండో అక్షరం అనకపోయినాడని తండ్రి గ్రహించాడు పిమ్మట అతడు బడిలోకి వెళ్ళటం మానుకున్నాడు ప్రకృతి పాఠశాలలో కావలసిన జీవిత విద్య అరించాడు అందుకు పాలకునికి, తండ్రి స్నేహితుడు పాలకుని కుమారెకు జబ్బుచేసింది తండ్రిని పిలుచుకుపంపగా, తనబదులు కుమారుణ్ణి పంపాడు లటీఫ్ వెళ్ళి రోగినాడి పరీక్షించి, ఈశ్వరుని హస్తంలో ఉన్న వారికెన్నటికి అపాయం లేదని అన్నాడు రోగి నవయౌవ్వని, సుందరి ఆసౌందర్యమునకు ముగ్ధుడైనాడు లటీఫ్ ఆమెను తెచ్చి పెండ్లి చేసుకున్నాడు తల్లిదండ్రులు ఒప్పుకోలేదు ప్రేమ లటీఫ్ను పిచ్చివానినిగా చేసింది. తన సర్వస్వం వదలి దేశద్రిమ్మరైనాడు వ్యామోహాన్ని భరించలేక 'ఓ సౌందర్యస్వరూపిణీ ఎక్కడున్నావని' అరిచేవాడు కొంతకాలం తిరిగి తిరిగి గిర్నార్, హింగ్లాజ్ పట్టణములకు చేరుకున్నాడు అక్కడ మహాయోగులున్నారు వారి నాశ్రయించాడు గురువు ప్రణవాక్షరమును ప్రసాదించాడు ప్రణవమంత్రం కటిక చీకటిలో తనకు వెలుగును ప్రసాదించిందన్నాడు లటీఫ్ అనేక కష్టములను భరించి ఇంటికి చేరుకొన్నాడు ఆలోగా ప్రియురాలు తనలో కలసి ఉన్నదని గ్రహించాడు అవిచ్ఛిన్నమైన ప్రేమ గ్రహించి, పాలకుడు తనకుమార్తె నతని కిచ్చాడు ఇద్దరూ కలిసి జీవిస్తున్నారు లటీఫ్ అప్పటికే భగవదమృతం పూర్తిగా సేవించాడు. అందువల్ల వైవాహిక నిర్లిప్తంగాను జీవితం సాగించాడు తన జీవితమును భగవత్సేవకు, గానమునకు వినియోగించాడు. పారవశ్యంలో ఉండగా అతని గానప్రవాహము, కట్టలు తెంచుకుని వెలువడి ప్రవహించేది లటీఫ్ మానవేశ్వర ప్రేమను పై పదములుగా పాడేవాడు మానవప్రేమ ఈశ్వరప్రేమకు మెట్టువంటిదనేవాడు మన మువ్వగోపాల పదములవలె ఉంటాయి ఇతని పాటలు లటీఫ్ పాడుతూంటే, పక్కనున్నవారు, ఆ పాటలు వ్రాసికొనేవారు కొంతకాలమునకు ఆ పాటలను పరిమార్చమని లటీఫ్కు సూచించారు అవిఅన్నీ నదిలో పారవేశాడు లటీఫ్. ఇదేమనగా, నా అహంకారం పారవేశానన్నాడు, అటువంటి అమృతప్రాయమైన పాటలాని గంగా నాశనం చేయటం న్యాయం కాదని శిష్యులు వేడుకొన్నారు శిష్యులలో ఒకడు ఆ పాటలన్నీ పాడగలడు అతడు పాడుతూంటే వ్రాయించి పరిమార్చి ఇచ్చాడు లటీఫ్.

లటీఫ్ త్యాగరాజు, అన్నమాచార్యులవంటి భక్తుడు ఇతడొకసారి గాఢనిద్రలో నామజపం చేస్తున్నాడు ఇద్దరు యువతులక్కడికి వచ్చారు అందులో ఒకామె ఇంకొకతెను నీ ప్రియునితో ఎన్నిసారు సమాగమం చేశావని ప్రశ్నించింది ఆమె ఆ లెక్క ఎందుకు? అతనిని నేను ఎప్పుడూ మరచిననని సమాధానం చెప్పింది ఇది విని లటీఫ్ చేతిలోని మాల విసిరివేశాడు ఆ కేకపాళ్లు ఈశ్వరుని నామం ఉచ్చరించేకన్నా, అతనిని హృదయంలో జ్ఞాపకముంచుకొనుటే ముఖ్యమన్నాడు లటీఫ్ మాంసాహారి కాడు అనేక లోకము లున్నవని చెప్పుకొంటేగాని వృక్షము, పక్షిని, పుష్పమును, పగులను పర్వతములను చూచి ఆనందించి, తన్మయుడై పాడుట ప్రారంభించేవాడు తనకాపి పెద్దవాడైన తర్వాత, నీ వయస్సెంత అని ఒకతడు అడిగాడు లటీఫ్ విస్మయ ఊరుకున్నాడు

కాని ప్రశ్నించిన వాడూరుకోలేదు నీవు వయస్సు చెప్పటకు సంకోచిస్తున్నావు దేనికన్నాడు. నాకు తొమ్మిది నెలల వయస్సని చెప్పాడు అబద్ధం చెప్పుతున్నావన్నాడు కాదు నేను సత్యం చెప్పానన్నాడు లటీఫ్ నేను భూమిమీదపడ్డ జన్మపోయింది ఈశ్వర దర్శనమైన తర్వాత నాకు నిజజన్మం వచ్చింది ఈశ్వరుని ప్రథమదర్శనం చేసి 9 నెలలైందన్నాడు అప్పటికతనికి 70 సంవత్సరముల వయస్సున్నదట 1747 లోనో 1758 లోనో పరమపదించాడని అంటారు భిట్‌షా అనే ప్రదేశంలో ప్రతి గురువారము రాత్రియంతా ఇతని పాటలు పాడుతుంటూ లీనమౌ సూఫీ తత్త్వవేత్త శిష్యులు.

రామం: అదుగో 'వానిటీ' తక్కినవాళ్లకన్న నువ్వేదో తేరుకుంటున్నావ్ ఔనా?

డాక్టర్: (చిరాకుగా చూసి) సరే. నే ఇంక వెళ్తాను. నే చెప్పింది గుర్తుంచుకో..

రామం (ఇది జ్ఞాపకం వచ్చినవాడిలా అయి) ఉండు ఉండు. కమల సుఖంకన్న నాకు కావల్సిందేముంది?

(డాక్టర్ వెళతాడు)

సరోజ: ఎందుకలా విసుక్కున్నావ్?

రామం: నీ కిప్పుడు సంజాయిషీ ఇవ్వాలా?

సరోజ: (ఊరుకోని) రామం — డాక్టర్ గారన్నది నిజమే?

రామం ఏమన్నారు?

సరోజ: కళ్ళగురించి

రామం (చిరాగ్గా) నీతో ఎందుకు చెప్పేను?

సరోజ అర్థంలేని ప్రశ్న

రామం అర్థంలేదు?

సరోజ లేదు

రామం నువ్వింకవెళ్ళు దాని కర్థముందా?

సరోజ లేదు.

రామం లేదూ?

సరోజ: లేదు

రామం (కుర్చీలో కూలబడతాడు) (సరోజ లోనికి వెళ్ళబోతుంది) వెళ్ళకు

సరోజ: వెళ్ళను కమలని చూసి—

రామం అక్కడికి, వెళ్ళకు—

సరోజ ఏం?

రామం: నీయిష్టమా నాయిష్టము?

సరోజ: ఇష్టం అయిష్టం ప్రశ్నలా? చూడకేం తప్పా?

రామం: ఎందుకు నీకా క్యూరియాసిటీ?

సరోజ ఇవాళ నీ తత్వం ఎందుకిలా ఉందో అర్థమవటం లేదు

రామం: అర్థం చేసుకుంటాను ప్రయత్నించకు—

సరోజ: కమల స్థితిచూడగా అలా ఉంది ఈ నీధోరణికి అర్థమేమిటి?

రామం: ఒకటే అర్థం మాటాడ్డం తప్ప ఇప్పుడు చెయ్యగలిగేదేమీ లేదు

సరోజ: ఈ మాటలు కాదు..

రామం పోనీ ఏం మాటాడాలో నువ్వే మాటాడు..

సరోజ అనవసరం

రామం: అనవసరం అయినది ఏదీ లేదు అంతేకాదు నాకు కూడా ఆ మనిషి మానసిక స్థితి నిరూపణే

సరోజ సంజాయిషీ ఒద్దులే—

రామం (ఊరుకోని) చెడ్డవాళ్ళని శిక్షించి, మంచివాళ్ళని రక్షిస్తాట్ట దేవుడు

సరోజ నీ మానసిక స్థితి నిరూపణే అనుకోవాలా?

రామం: తప్పదు—ఈ విషయంలో ఇది అక్షరాలా నిజం

సరోజ (ఆశ్చర్యపోయి, కుర్చీలో కూర్చొని) ఎవరా చెడుమనిషి కమలా?

రామం (లెంపలు వేసుకుని) నేను

సరోజ నీకేమయింది?

రామం ఇంకేమవాలి?

సరోజ ఔను నీకేమయింది?

రామం ఏమీ అనలేదా?

సరోజ నీకేమీ కాలేదు — బాధ పడుతున్నది కమల

రామం అంతే అంటావా?

సరోజ అంతే

రామం నీకు మనసు లేదు

సరోజ ఎలా పోల్చేవ్?

రామం నే ఎంతబాధపడేదీ గ్రహించలేకపోయేవ్

సరోజ క్షమించు రామం నువ్వు బాధపడుతున్నావ్ నాకు తెలుసు కాని శిక్ష అనుభవించేది కమల కాదూ?

రామం: డాక్టరన్నదే అయితే నేనూ శాశ్వతంగా ఆబాధ పంచుకోవాలా ఒద్దా?

సరోజ (ఆశ్చర్యపోయి) ఏమిటి? నువ్వంత. !

రామం నేను ఏమిటి?

సరోజ (ముగ్ధగాచూసి) ఇంత స్వార్థపరుడ వనుకో లేదు

రామం (ఉక్రోషంగా లేచి) ఏమిటన్నావ్? నేనా? ఎలా? చెప్పగలవే చెప్పు? కమలని నా ప్రాణసమానంగా చూసుకుంటున్నాను కమల బాధ నా బాధ కాదూ? అందుకు నేను స్వార్థ

సరోజా! నీకిది అభిప్రాయం ఉందన్నమాట. ఇదివరకెల్లా నామొహంముందనడానికి అవకాశం దొరకలేదు ఇలా అవకాశం దొరికిందని నువ్వేదో ఆవేశంలో ఉన్నావు సరోజా కమలే నాకన్నీ కమల ఋణం ఎలా తీర్చుకోను!

సరోజ తప్పు మాటంటే క్షమించు రామం అంత ఆవేశపడి నోరుపెట్టకు — చేసేం ఆలోచన పనిలేదు పాతనాటకమంతా అనకు — నాకు చిరాకు

(లేచి గదిలోకి వెళ్తుంది)

రామం నాటకమా! నాటకం నీది నీమా నాటకం నీది

(తల్లి వస్తుంది)

తల్లి ఏమిటూనోరు రామం కమల మగతగా నిద్రపోతోంది

రామం (తల రెండుచేతులతో నూ పట్టుకుని, ముఖం టేబిల్ కు ఆన్చి) ఈబాధ, చీదర, దు:ఖం ఇంకా అనుభవించాలా? నేనేపాపం చేసేను!

తల్లి ఏమిటి వాలకం?

రామం వాలకమే—చాలా తల్చినవాణ్ణి బతకడం వాలకం కాదూ? బతికి ఈ బాధలన్నీ అనుభవించడం

తల్లి ఏ బాధలు?

రామం ఏమీ లేదు. నీకర్థం కాదు

తల్లి : ఎప్పుడూ పొరపాటునన్నా అలా అనకు . కమల చెవిని పడ్డాయంటే (కళ్ళొత్తుకుని) పిచ్చితల్లి . దేవుడిని రాతిమనసు దానికి శిక్షేలా?

రామం: నేనేం చేశానమ్మా కారణం?

తల్లి : నువ్వా!?

రామం: నాకోనాడింత చెయ్యెత్తి చాపనిచ్చి ఉంటే ఈ బాధలేవీ ఉండకపోను కదా?

తల్లి · అనుమానం అను. తెలిసిపోయింది అన్నమాటలకి నేనేం జవాబు చెప్పను?

రామం (ఆలోచించి) మరోలా అనుకోకమ్మా. ఏదో చిరాకుగా ఉండి అనేసేను

తల్లి : (కళ్ళొత్తుకొని) నాకు తెల్సురాబూ దానిమీద నీకెంత ఆపేక్షో . నాకు తెల్సు. ఇన్నాళ్లూ తిండీ నిద్రాలేక దాని ముందర ఎక్కడ కూర్చున్నావే

రామం ఎక్కడా న్యాయం లేదు ఏం చేసిందని

తల్లి : నువ్వే ధైర్యం వదులుకుంటే నామాటేం చెప్పేవ్ బాబు—నాకు గుండె దడుక్కుపోతోంది.

రామం: నువ్వేమీ బాధపడకమ్మా అంతా నే చూసుకుంటాను

తల్లి · అలా నే కానీ బాబు కాని నువ్వేం పిచ్చి పిచ్చిగా ఆలోచించకు దాని బాధ చూడలేక నీకలా అనిపిస్తుంది

[తల్లి వెళ్తుంది రామం చిరాగ్గా ముఖంపెట్టి ఆలోచనలో పడతాడు—ఒక నిముషం గడుస్తుంది ఎక్కడినుండో ఒక ప్రేమగీతం రికార్డు వినవస్తూ ఉంటుంది సరోజ వస్తుంది]

రామం చూసేవమయిందా?

సరోజ ఊఁ—

రామం ఏఁవిఁటి చూసేవ్?

సరోజ ఏఁవిటి చూస్తాను? కమలని

రామం ఎలా ఉంది

సరోజ నిద్రపోతోందిలా ఉంది—

రామం కూచోవు?

సరోజ నే వెళ్ళాలి

రామం జరూరు పనేమన్నా ఉన్నాయా?

సరోజ టౌన్ హాల్లో ఏదో 'పెర్ ఫారమెన్సు'ంది— నాకసలు వెళ్ళాలని లేదు నిరాల పొంచితే తీ కూచుంది

రామం ఓ నాను ఈసంగతులే మర్చిపోతున్నాను.

సరోజ (కూచుంటూ) మనకు శాంతి లేనప్పుడు ఎవరికన్నా అంతే

రామం (నిట్టూర్చి) మనిషికి వినోదాలు అవసరమన్న సంగతే మరిచిపోతున్నాను

సరోజ మనకు శాంతిలేనప్పుడు ఎవరికన్నా అంతే.

రామం టౌన్ హాల్ లో పెర్ ఫారమెన్సుందా?

సరోజ ఉంది

రామం ఏం పెర్ ఫారమెన్సు?

సరోజ సోకులు. చిన్న నాటిక

రామం ఏ నాటిక?

సరోజ: గుర్తులేదు.

రామం అది నా విధి—

కమల: ఏంమాటలు! విధి కొట్టి చేస్తున్నట్టు

రామం మనసుకి దగ్గరగా ఉన్నవారిలాగే విధు లుంటాయి.

కమల మీకు పొగడ్డం బాగా తెచ్చు

రామం: దీనికి ఉక్కిరిబిక్కిరవను

కమల సరోజ జన్మించటం నా అదృష్టం—కురవకుండా వచ్చి, దగ్గరకూచొని వెళ్లిపోయింది ఇంత ప్రేమకి నేను తగను—అందుకు నాకేదే కారణమయితే అంతకన్న సిగ్గుపడవల్సింది లేదు

రామం అపోహపడకు

కమల నాకు జాలిపడ్డ కంటే, క్షమనుక్షమను చూస్తే జాలి వేస్తుంది అసహ్యం కూడా వేస్తుంది అదే బాధయం

రామం నీకీ ఆలోచనలు అలవాటయిన మాటలు—

కమల నిజమే నాలో నాకు నమ్మకం పోతోంది. అందుకే నాకీ అనుమానాలన్నీ నా

రామం ఏ అనుమానాలు?

కమల మీరు ప్రేమిస్తున్నారని

రామం అంతేనా?

కమల మీరొక కుటుంబంలా ఉన్నాననిపిస్తుందో కొన్ని అప్పుడు

రామం (నవ్వుతాడు)

కమల ఆనవ్వులించే ధైర్యం వస్తోంది

రామం ఎందుకు నీకు ధైర్యం?

కమల ఇదే నిమిత్తమిా ఇన్నాళ్ళ, మీకొక భారంగా ఉండి ప్రేమిస్తూ ఉంటే మీరు విసుక్కుందురుం దేమోనని భయం

రామం నీకనుమానం కలిగించే పను లేమన్నా చేసినా?

కమల అయ్యో లేదండీ

రామం నీ కేదో అనుమానం వేసి ఉండాలి.

కమల (ఊరకుంటుంది)

రామం ఏమిటా అనుమానం?

కమల మరేమిలేదు మీరు మునుపట్లా నాతో లేక పోయేటప్పటికి

రామం అంటే?

కమల: కోపమా?

రామం: లేదుకమలా చెప్పు

కమల నాతో ఎంతో ప్రేమగా, లాలనగా మాట్లాడే వారు ఇప్పుడు మీరు తీరిక లేక

రామం ఇందుకేనా

కమల ఉత్తినే ఏదో ఆలోచన అయినా నేను అందుకు తగనప్పుడు ఆశించడం

రామం అదుగో మళ్లీ ఇలా మాటాడితేనే నాకు చికాకు

కమల అదుగో చూసేరా? మీకు చికాకు కలిగింది

రామం చిన్న సంగతులు మనస్సులో పెట్టుకొని ఇలాటి ఆలోచనలు చెయ్యకు—

కమల క్షమించండి మళ్లీలా అనుకోనండి—

రామం ఆ క్షమించమనడం చూసే అనుమానం నీకుంది-

కమల నా కనుమానం ఉంటే నాదే తప్పు మీ అనురాగాన్ని చేజేతులా పోగొట్టుకుంటున్నట్టే అందువల్ల

రామం (కమల చేతిని అందుకుంటాడు)

కమల అదుగో సరోజ

రామం: నా కగపడలేదు—నువ్వు పసిగట్టేసేవ్

కమల ఒకక్షణం తీసుకున్నప్పుడు నవ్వు ఇంకోక్షణం ఎక్కువ చేస్తాడుట

(సరోజ వస్తుంది)

సరోజ కమలా చాలా కులాసాగా ఉన్నా వివాళ?

కమల ఒకనాడు కులాసాగా లేనుకనకనా

సరోజ: ఆ చిరునవ్వా అది.

కమల నీ కన్నీ కొత్తే

సరోజ నువ్వెప్పుడూ కొత్తే (కూచొని) రోజుల తరబడి విచారంగా ఉంటావ్ అనక విచారమూ ఉండదు, నవ్వూ ఉండదు. ఆలోచిస్తూ ఉంటావ్ ఒకోనాడు ఇంత కులాసాగానూ ఉంటావ్.

కమల: మీ ఇద్దరి ప్రేమ, అనురాగం నా కుండగా సంతోషంకోక మరేముంటుంది నాకు—

సరోజ ఎప్పుడూ అలా ఉండరాదూ?

కమల అక్కర్లేదు. ఇంత అనురాగానికి అలవాటు పడ్డదాన్ని అది లేకుండాపోతే ఏమయి పోతానో అనిపిస్తూ ఉంటుంది.

(రామం, సరోజ ఒకరినొకరు చూసు కుంటారు—)

# కాటయ వేమభూపతి

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

ఆంధ్రభూభువన మగ్ర్యప్రదేశమును మన్నెయముగ మున నిరుపద్రవముగను నిరోత్ర్తిరముగను శాస్త్ర విధిననుసారముగను పాలించిన ప్రభువులలో వేమ నామధారులైన రెడ్డిప్రభువులు ప్రధానముగ గణింపఁ దగినవారు. కాకతీయ సామ్రాజ్యము విచ్ఛిన్నమైన తరువాత, ఆంధ్రదేశము యవనాక్రాంతమై శాంతియు ధర్మము విధ్వస్తమైనప్పుడు తదుద్ధరణమునకై బుద్ధి బాహుబలములు వినియోగించి, తదుద్ధారమునకై యత్నించినవారిలో ప్రథముఁడగు ప్రోలయ వేమా రెడ్డి. ఈతఁడు మహాశూరుఁడు పరమ ధార్మికుఁడునై, అద్దంకి రాజధానిగా రాజ్యపాలనము సేయుచు ధర్మోద్ధరణమునకు పారమ్యతపోమహిమునకు నెంతయుఁ దోడ్పడెను. శివకేశవులం దఖండ భక్తిభావ సమన్వితుండై శ్రీశైలాహోబల క్షేత్రములందు సోపానసరణి నిర్మింపఁ జేసి పుణ్యకీర్తుల నార్జించిన ధన్యుఁ డీతఁడు. ఆంధ్ర వాఙ్మయోద్ధారకుఁడై శంభుదాసుఁడను ఎఱ్ఱాప్రెగడచే రామాయణ హరివంశముల నాంధ్రమునం దవతరింపఁ జేసిన ధన్యుఁడు. శ్రీశైలవాసియగు ఘోడేరాయ గురువర్యుని యాదేశానుసారము రాజ్యపాలనము సాగించుచుఁ, గురూపదిష్టవిధానమున హేమాద్రిదానముల నాచరించిన ధార్మికుఁడు. ఈ విషయ మంతయు దృజ్జవరపు శాసనమునం దిట్లు చెప్పఁబడియున్నది.

శ్లో. శేషాంప్రశస్తసుమహిమాపరపారిజాతః
శ్రీ వేమభూప రమణోజనలోక గండః,
శ్రీ ఘోడేరాయ గురువర్య దయావశేషా
త్ప్రాప్య ప్రశస్తి సకలామలకీర్తి వృత్తిః
హేమాద్రిణా నిగదితాని మహాపదానా
దానవ్రతాని సుమహాంత్యపి యశ్చకార
దత్త్వాయ శ్రేద్ధ్యుభవనం సకలద్విజేభ్యః
శివాంచయః పృథుయశాః స్వయ మన్వభుఙ్క్త
పాతాళగంగా మధికృత్య కృతాంనాం
శ్రీ పర్వతాగ్రా దవరోహణాయ,
సోపానపంక్తిం కృతవాన్నృపాత్మ
కల్యాణశైలం వ్యసుమానయత్నః 1

ప్రోలయ వేముని యీ ధార్మికకృత్యములు, ఆతని తరువాతి రెడ్డిరాజులు నిర్మించిన దాన శాసనములందుఁ దఱచుగఁ జెప్పఁబడుచు వచ్చినవి. ప్రోలయ వేముని శౌర్యము సర్వవిదితము. నీతని తరువాతి రెడ్డిప్రభువుల కాదర్శప్రాయమై వెలసినవి. ఈతని కుమారుఁడగు అనవేమారెడ్డియు నీతనివలెనే మహావీరుఁడు, పరమధార్మికుఁడు విద్యాపోషకుఁడునై వన్నెకెక్కినాఁడు. అనవేముని వదాన్యత సర్వాంధ్రదేశ ప్రసిద్ధమై పండిత రసనారంగముల నాఁటికి నేఁటికిఁ బాయక నిలిచియున్నది. ఈతని శౌర్యము కాటయ వేముని గోమరగిరి శాసనమునం దిట్లు వర్ణింపఁబడినది.

శ్లో. యస్యాస్తాం విజయే సమస్తవిదితౌ శ్రీశైల సింహాచలౌ
స్తంభౌ పశ్చిమపూర్వదిగ్విభజన వ్యాఖ్యాన వైజ్ఞానికౌ 2

ఈ శ్లోకమునుబట్టి యనవేముఁడు శ్రీశైల సింహాచలములను పశ్చిమ పూర్వదిశలందు విజయస్తంభములుగాఁ జేసి, తన్మధ్యాంధ్రదేశమును దనవశము గావించి పాలించెనని తెలియవచ్చుచున్నది.

ప్రోలయ వేముని దౌహిత్రుఁడగు కాటయ వేముఁడు విజయసాధనమున శౌర్యాటోపమున ధర్మనిరతిని అగ్రహారాది దానమున సర్వధా మాతామహుని బోలినవాఁడు. ఈ విషయ మంతయు కాటయ వేముఁడు గోదావరీమండలమున నిలిపిన దానశాసనముల వలన విస్పష్టముగఁ దెలియవచ్చుచున్నది. మాతామహునికంటెను గూడ నీతని కీర్తికి విశిష్టత గొని తెచ్చిపెట్టిన దీతనికిఁ గల సంస్కృతభాషా పాండిత్యము. రాజరాజనరేంద్రుని తరువాతి రాజమహేంద్ర

1 చూ. రెడ్డిసంచిక అనుబంధము 1 శాసనము.
2. See J A H R S Vol XI P P. 209

ప్రముఖుండగు అంతటి సంస్కృత పాండిత్యము గలవాఁడు. ఈతని వైదుష్యము కుమారగిరి యాస్థానమున వసంత రాజీయాభిధానమున నాట్యశాస్త్ర సమన్వయము చేయుచు రచించిన కాళిదాస విరచిత రూపకత్రయ వ్యాఖ్యానము లందు కుమారగిరి రచనములంగూడ గానవచ్చును. ఈతని వైదుష్యమును గూర్చి నే నిదివరకు రెడ్డి సంచికలో 'కాటయ వేముని వైదుష్యము' అను వ్యాసమునఁ గొంత తెలిపియుంటిని 15

కాటయ వేముఁడు కవిసమ్రాట్టగు కాళిదాస విరచిత దృశ్యకావ్యములు మూఁడింటికి వ్యాఖ్యానము రచించి యుండుటచేతనే, మల్లినాథసూరి శ్రవ్యకావ్యములకు సాలంకారముగ వ్యాఖ్యరచించి దృశ్యకావ్యములకు వ్యాఖ్యల రచించుట మానినాఁడు. వేముఁడు కుమారగిరి యాజ్ఞమున, నాతనియెడఁ దనకుఁగల కృతజ్ఞత వెల్లడించుచు, తద్విరచిత వసంత రాజీయోదాహృతులతో లక్షణ సమన్వయము చెప్పుచుఁ గృతిరచనమునకుఁ గడంగుటచే, నీతని వ్యాఖ్యలవలనఁ గుమారగిరి పాండిత్యముకూడ జిజ్ఞాసువులకు విదితమగుచున్నది. ఏయే కవులందు భరతాది ప్రాచీన నాట్యశాస్త్రవిషయములకు లోఁగని యంశము లుండునో యట్టి కవులందే వసంతరాజీయోక్త పద్ధతిని నాట్యశాస్త్ర సమన్వయము గావింపఁబడినది. కాని యాశాస్త్రాశ్రితమైనచోట లక్షణము సర్వథా సంశయ విచ్ఛేదకముగనుండును. వ్యాఖ్యానమును చేయు పద్ధతిలోఁ గాటయవేముఁ డంగీకరించిన పద్ధతి సర్వదా సమర్థనీయముగనుండును. ఈతని వ్యాఖ్యలందలి విశిష్టతను గూర్చియు వసంత రాజీయ విశిష్టతను గూర్చియు మఱియొకప్పుడు వ్రాయఁదలఁచి కొంత వివరింప ప్రయత్నింపను.

---

15 మా రెడ్డి సంచిక పుట ౪౮౪ ౪౮౮

# అంతర్వాహిని

## హితశ్రీ

* గతసంచిక తరువాయి *

### 12

విశ్వం హైదరాబాద్ నించి తిరిగివచ్చాడు. బండి దిగగానే ఎదురుగా వొచ్చాడు గోపి. తనకు తెలుసున్న వాళ్లు ఎవరొచ్చినా గోపికి అలా ఎదురురావటం అలవాటు. విశ్వం అది చాలాసార్లు గమనించాడు. అయితే అలా ఎదురురావటమనేది అందరిపట్లా సర్వ సామాన్యమే. తనూ తెలిసినవాళ్లొస్తే ఎదురువెళతాడు కాని తనలాంటి పెద్దవాళ్ళు అలాచేయటంలో కుర్రవాడైన గోపి అలాచేయటంలో తేడావుంది. తరం దాలో తేలికగా కూర్చొని కబురు చెప్పుకుంటున్నప్పుడు విశ్వం గోపిని అడిగాడు. "వాళ్లో బండిదిగి చుట్టాలెవరైనా వొస్తున్నప్పుడు ఎదురువెళ్లటం దేనికిరా గోపి, వాళ్లెలాగూ ఇంట్లోకి వస్తారుగా"

గోపి ఆ ప్రశ్నకి తెల్లబోయాడు. ఏం సమాధానం చెప్పాలో వాడికి తెలియలేదు.

"ఊరికే" అన్నాడు

"మర్యాదకోసమా?"

గోపి థర్డ్‌ఫారం చదువుతున్నా అది ఈడుకి మించిన చదువు. వాడికి ప్రశ్నలోని భావం సరిగా అర్థం కాదని విశ్వానికి తెలుసు "ఉహుఁ" అన్నాడు గోపి ప్రశ్న అర్థమైనట్టుగానే

"వెళ్లాలనిపిస్తుందా?"

అవునన్నాడు గోపి. ఎందుకనిపిస్తుందో వాడికి తెలియదు వాడు ఆలోచించివుండడు. కాళ్లు లాక్కుపోతాయి, అంతే

విశ్వం ఆలోచించాడు. తనలా ఎదురువెడితే ముఖ్యంగా మర్యాదకోసం వెడతాడు. మనస్సు హెచ్చరిస్తుంది వెళ్లమని. ఆహ్వానించేది ఏం లేదు. పరిచయస్థుణ్ణి చూడగానే హృదయంలో కలిగే సాంత్వనం ఏదో అప్రయత్నంగా వాడిని అలా లాక్కుని వెడుతుంది.

ఇది పైకి చాలా చిన్నవిషయంగానే కనిపించినా ఇందులో గంభీరభావం ఏదో ఇమిడివున్నట్టనిపించింది విశ్వానికి. అన్నిసార్లు గోపి తన బండిదగ్గిరికి పరిగెత్తుకు వచ్చినా ఆ విషయం గురించి ఈరోజు ఆలోచించినట్టు ఆలోచించలేదు పూర్వం ఎన్నడూ. ఈసారి గోపి అలా రావటం చూడగానే తనకీ ఊహ ఎందుకు కలిగిందో!

కొంచెంసేపాగి విశ్వం అడిగాడు.

"గోపీ, నువ్వెరిగిన వాళ్ళందరిలో ఎక్కువ మంచి వాడెవరు?"

"రంగారావు మాస్టరుగారు" తడుముకోకుండా చెప్పాడు వాడు

"ఎందుకూ?"

గోపి ఆలోచించాడు

"ఏమో" అన్నాడు చివరికి

రంగారావు మంచివాడే అయితే గోపిమాస్టర్లలో అంత మంచివాళ్లు ఇంకా వున్నారు. కాని వాడికి రంగారావంటేనే అభిమానం ఎందుకో! ఆ విషయం వాడికి తెలియదు

"అందరిలోకి ఎవరంటే నీకిష్టం?"

గోపి కొంచెం ఆలోచించి అన్నాడు.

"అక్కయ్య"

"ఎందుకు?"

ఈసారి సమాధానం వాడికి తెలుసు. స్కూలుకి వెళ్ళినప్పుడు రైలు కదుల్తుంటే అక్కయ్య దూరమవుతుంటే వాడికి కన్నీళ్ళుతిరిగాయి, అక్కయ్యకీ తిరిగాయి. వాడికి అక్కయ్య కావాలనిపించింది. వాడి ఆలోచనలు ఆమెవైపు మరలాయి జవాబివ్వటం మర్చిపోయాడు. విశ్వం అది గమనిస్తూనే ఉన్నాడు. వాడి మనసులో ఏ మూలో కూడా అతనికి తెలుసు.

విశ్వం ఆలోచనలోపడ్డాడు. కొన్ని విషయాలు

కేవలం తార్కికంగా ఆలోచిస్తే తేలదనికాదు ఆ అవసరం కూడా లేదేమో. హృదయంలోని ఏవో అనుభూతులు మన ప్రవర్తనకి కారణం మౌతాయి కొన్ని సమయాల్లో అదిహేతుపూర్వకంగా ఉండకపోవచ్చు సమర్థనీయం కూడా కాకపోవొచ్చు కాని హృదయంలోని ఆ అవ్యక్త భావాలని కాదనటానికి వీల్లేదు.

డాక్టర్ ప్రవర్తనగురించి తను సందేహంగా చెప్పినప్పుడు ఆమెలో కలిగిన ధోరణి తనుమర్చిపోలేదు ఆమెఆలోచించటం మానేసింది. హృదయం మూగగా ఏదో పలికింది లేకపోతే ఆమె అలా ఆవేశంగా మాట్లాడలేదు అనుగుణంగా తన హృదయం స్పందించింది అంతగా హృదయాన్ని ఊపి వేయగల సన్నివేశం తన జీవితంలో ఇంతవరకు జరగలేదు. పద్మ వ్యక్తిత్వం తనకిప్పుడు పరిమళిస్తోంది అంతగా తన వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకోడంవల్లే డాక్టర్ మీద ఇతర్ల అభిప్రాయాల్ని తృణప్రాయంగా భావించి ఉదాత్తంగా వ్యవహరించగలిగింది. పద్మలా ఎంత మంది ఉంటారు!

కారులో అలాగే ఆలోచిస్తూ కూర్చున్నాడు విశ్వం ఆలోచనల్లో వసంత జ్ఞాపకం వచ్చింది పదిహేను రోజులైనా అయివుంటుంది తనామెను చూసి బజారికి వెళ్ళి కాస్త కాఫీతాగి అలా వసంత ఇంటికి వెళ్లాలనుకున్నాడు విశ్వం కాని ఇంతలో మనసు మార్చుకున్నాడు రైల్లో నిద్రలేక కళ్ళు బరువుగా వున్నాయి సాయంత్రం వెడితే ఖులాసాగా ఉంటుందనుకున్నాడు

సాయంత్రం కాగానే ఆకాశంలో మబ్బులు అలుముకోసాగాయి సన్న జల్లుకూడా ప్రారంభమయింది అయినా విశ్వం బయల్దేరివెళ్లాడు తలుపు తట్టబోయేంతలో అతనికి లోపలనుంచి ఏవో మాటలు వినిపించసాగాయి, అగాడు మాటలు రానురాను స్పష్టంగా వినిపించసాగాయి. వసంత కంఠం తీవ్రంగా వినిపిస్తోంది. ఉన్నట్టుండి చెంప ఛెళ్ళుమన్న శబ్దం వినిపించింది దడాలున తలుపు తోసుకుని లోపలికి అడుగు పెట్టాడు విశ్వం. దండకొడితే భుజంగంలా ఉంది వసంత. పక్కన వెంకటేశ్వరరావు కందగడ్డలాంటి వదనంతో నుంచున్నాడు. చప్పుడు విని ఇద్దరూ తలుపు వైపు చూశారు.

"ఏమైంది?" అన్నాడు విశ్వం ఇద్దరివైపూ చూస్తూ

వెంకటేశ్వర్రావు ముఖం మరింత ఎఱ్ఱబడ్డింది.

"చెయ్యి పట్టుకున్నాడు దుర్మార్గుడు," అంది వసంత కోపంతో

"ఎత్తిరత, పాపం" అన్నాడు వెంకటేశ్వర్రావు పేలవంగా

"షటప్" అన్నాడు విశ్వం పళ్ళునూరి.

"విశ్వంగారూ, మర్యాద ఇచ్చి పుచ్చుకోండి మీకు పరిస్థితులు తెలియవు ఎంతసేపూ తగలేశారో, ధవానీ కొంగుడిలా"

"ఏంటి?" అంది వసంత రెట్టిస్తూ.

"చెప్పాలా?"

"నేను మీ బహుమతి ఒక్కటికూడా ముట్టలేదు. ఎప్పటికప్పుడే తిరగొట్టినా సిగ్గులేక" వసంత పూర్తిచెయ్యలేదు

"మీవాళ్లకిస్తే ఒకటి నేనిస్తే ఒకటీనా?"

"నాకు వాళ్లతో సంబంధం లేదు"

వసంత కళ్లలో నీరు తిరిగాయి.

"ఇదేనా మీ నాటక కళోపాసన?" విశ్వం వెంకటేశ్వర్రావువైపు అసహ్యంగా చూస్తూ అన్నాడు.

"మీ చిత్ర కళోపాసన సంగతేమిటో!"

విశ్వం నిరుత్తరుడయాడు ఒక్క క్షణం

"గురువింద గింజ తన నలుపెరగదట!"

"ఇక నీ వేదాంతాలు చెయ్యకండి గెటౌట్" గట్టిగా అరిచాడు విశ్వం

"తమరే దయచెయ్యండి" అన్నాడు వెంకటేశ్వర్రావు వ్యంగ్యంగా

విశ్వం చెయ్యి చేసుకోటానికి సిద్ధపడ్డాడు.

"సిద్ధమే"

వసంత కలగచేసుకుంది.

"వెంకటేశ్వర్రావుగారూ, మా ఇంట్లోనుంచి వెళ్ళి పొమ్మంటున్నాను పెద్దమనిషితరహాగా ప్రవర్తించలేరా?"

ఏమనుకున్నాడోగాని వెంకటేశ్వర్రావు "ఆల్ రైట్" అని వెళ్ళిపోయాడు.

"బి ఎల్ ప్యాసయాడు లేపోతే ప్రాక్టీస్ పెట్టుకున్నాడు ఏంటుద్దేశించి?" అన్నాడు విశ్వం జాలిగా.

చేసిన ఒక్క అద్దవని చెప్పుకుంటే తను ఆలోచించుకోవక్కర్లేగు మంచిదని చెప్పుకుంటే—అదే పూర్వపు సమాధానమే చేసిన చోటే గొంగళి

ఒక్క మంచిపని!

విశ్వానికి ఇటువంటి ఆలోచనకట్టింది. వసంతని తను పెళ్ళిచేసుకుంటే! ఒక అబలని, దురాచారానికి బలికాకుండా తప్పించుకోవాలని తాపత్రయపడే ఒక కన్యని ఉద్ధరించినట్లవుతుంది అంతకంటే ఎవరు మాత్రం చెయ్యగల గొప్ప మంచిపనేముంటుంది? తను వసంతని వివాహం చేసుకుంటాడు

కాని అది అంతసులభమా? ఎన్ని అవాంతరాలు దాటాలో! ఎన్ని చిక్కులొస్తాయో! అన్నిట్నీ మామయ్య ఒప్పుకోనని పట్టుబడితే! ఒక వేళ బావకి తనే చేసుకోవాలని ఉంటే! ఈ పరిస్థితుల్లో తనేం చెయ్యాలి ఏం చెయ్యగలడు? పైగా ఈ వివాహానికి ఇంట్లో ఒప్పుకోరు కనకపోతే ఇంట్లోంచి వెళ్ళిపోయి పెళ్ళి చేసుకోవాలి. బహుశా మళ్ళీ ఇంట్లో అడుగు పెట్టనివ్వరు ఉద్యోగం అయితే పరవాలేదు. కాకపోతే తనెలా ఆమెని పెళ్ళి చేసుకోగలడు!

కాని వసంత అలా సంఘర్షణలో నలిగిపోతుంటే ఎలా ఊరుకోగలడు? తనామెని ఉపేక్షించలేనంత నిస్సహాయుడా? వెంకటేశ్వర్రావులాంటి తో పెళ్ళి జరిపించి ఆమె తన్నుతానెలా రక్షించుకుంటుంది, పాపం

విశ్వానికి ఎటూ తేలలేదు రాత్రంతా ఆలోచనతోనే కాలం గడిచింది తెల్లారేసరికి కళ్ళు ఎర్రబడి ఉన్నాయి తల దిమ్మెక్కింది వర్షంలో తడవటంవల్ల ఆరోగ్యంకూడా దెబ్బతింది ఒంటరిగా ఉన్నప్పుడల్లా రాత్రిజరిగిన సంఘటనే మనసులో మెదుల్తోంది

విశ్వం ఇలా ఆలోచిస్తుండగా రంగనాథంగారు ఓ ఉత్తరం తెచ్చి అతనికిస్తూ "ఏమిట్రా ఇది?" అనడిగారు ఉత్తరం మొదటి పంక్తి చూడగానే అతనిప్రాణం పైకెగిరిపోయింది. అది ఆకాశరామన్న ఉత్తరం లోకల్ డెలివరీలో వచ్చింది విశ్వానికి వసంత అనే నాటకాల్లో వేషాలువేసే అమ్మాయితో సంబంధం ఉందనీ, వాళ్ళు పెళ్లి చేసుకోబోతున్నారనీ హెచ్చరించాడు, ఆకాశరామన్న ఇది వెంకటేశ్వర్రావు పనే అయి ఉంటుందని వెంటనే ఊహించాడు విశ్వం

"శుద్ధ అబద్ధం" అన్నాడు విశ్వం ధైర్యంగా.

"నువ్వు రోజూ పొద్దున్నే ఎక్కడికి వెళ్ళేది?"

విశ్వానికి నిజంచెప్పాలో అబద్ధం చెప్పాలో తెలియలేదు ఎందుకైనా మంచిదని నిజమే చెప్పాడు.

"ఆ అమ్మాయి ఇంటికి"

"బొమ్మ వేస్తున్నాను దానికి మోడల్ కావాలి. ఇంటిదగ్గిర బావుండదని అక్కడికి వెళ్తున్నాను."

ఈ సమాధానానికి రంగనాథం కొంచెం వెనక్కి తగ్గాడు

"ఇహనించీ అది మానటం మంచిది. ఏమంటావ్?"

"బొమ్మ పూర్తి కావొద్దూ?"

"అక్కర్లేదు"

"అయితే సరే"

"ఒక వేళ నువ్వేమైనా మనసులో ఆ పిల్లని పెళ్ళిచేసుకుందామని అనుకుంటున్నావేమో అలాంటిది నాకు నచ్చదు నీదారి నువ్వు చూసుకోవాలి ఇంక ఆ పక్షంలో ఆనర్స్ ప్యాసయినవాడివి నీ కింతకంటే ఏం చెప్పక్కర్లేదు"

అని అతను వెళ్ళిపోయాడు విశ్వం దీర్ఘంగా నిట్టూర్పు విడిచాడు తను రాత్రి అనుకున్నాడో లేదో, అప్పుడే విఘ్నాలు మొదలు ఈ కుళ్ళిపోయిన సంఘంలో ముందుకు వెయ్యటం సాహసకార్యమే. కాని తను హేతువాదానికి నిలబడాలి తను చెయ్యగలిగింది తప్పక చేయాలి వసంతని తను పెళ్ళిచేసుకుని తీరాలి జీవితంలో అవకాశాలు సులభంగా రావు. వొచ్చిన ఈ దాన్ని సద్వినియోగం చేసుకోవాలి

ఆ సాయంత్రం వసంత ఇంటికివెళ్లి తన నిశ్చయం చెప్పాలనుకున్నాడు విశ్వం కాని ఆమె ముఖం చూడటానికి సాహసం చాలక మానుకున్నాడు. ఉత్తరం రాద్దామని ఆలోచించాడు. కాని ఉత్తరాలు ప్రమాదకరమని రాయలేదు

ఈ సంఘటన జరిగిన తరవాత విశ్వానికి ఇంట్లో మసలటం కష్టం అనిపించింది తనని అదోలాగా చూస్తున్నారు అది కాక తను రెక్కలు వచ్చి ఉద్యోగంలో ఇంకా చేరలేదు తనమీద నిర్లక్ష్యభావం ఇంట్లోవాళ్ళకి ఏర్పడసాగిందని అతను భావించాడు.

# అంతర్వాహిని

అదృష్టవశాత్తూ తను విజయవాడలో ఒక ఆఫీసులో ఉద్యోగానికి పెట్టిన దరఖాస్తుకి ఫలితం దక్కేలా ఉంది. ఇంటర్వ్యూకి రమ్మని రాగానే విశ్వం ఏమీ ఆలోచించకుండా వెంటనే బయలుదేరాడు, పెట్టేబేడా సర్దుకుని. ఉద్యోగం చిన్నదే, అయినా తాత్కాలికంగా చెయ్యవచ్చు అనుకున్నాడు. రంగనాథంగారేమీ అడ్డుచెప్పలేదు. ఈ ఊరినుంచి వెడితే అమ్మాయి వ్యవహారం కూడా పరిష్కారమైపోతుందని ఆయన భావించాడు. అందువల్ల ఏదో ఓ ఉద్యోగం ఎక్కడ దొరికినా సరే వెళ్లటం మంచిదని ఒక సాధారణ సలహా ఇచ్చాడాయన. విశ్వానికి ఆ సలహా కొంచెం కష్టంగానే ఉంది. తను ఇంట్లో ఊరికే ఉండటంవల్ల అలా తండ్రి అభిప్రాయపడ్డాడని అతను అనుకున్నాడు.

విశ్వం దరఖాస్తుపెట్టింది ఒక రాజకీయపార్టీ ఆఫీసులో అకౌంటెంట్ పనికి. ఇంటర్వ్యూలో కార్యదర్శి ఏవేవో ప్రశ్నలడిగి చివరికి విశ్వంవైపు దీక్షగా చూసి అన్నాడు

"రఘు అనేపేరు బ్రాహ్మలేకదండీ పెట్టుకునేది?" ఆ ప్రశ్నలోని భావం వెంటనే విశ్వానికి అర్థంకాలేదు

"ఈ రోజుల్లో అందరికీ అది మామూలుగా ఉండేపేరే గదండి" అన్నాడు

కార్యదర్శి విశ్వంవైపు చూస్తూ ఏదో అనటానికి సంకోచిస్తున్నాడు

"మీగురు ?" అంతవరకే ఆయన అడిగాడు, విశ్వం సమాధానంకోసం ఎదురుచూస్తూ

అర్థమైంది విశ్వానికి. అతనిముఖంలో అసహ్యం తాండవించింది. ఈ మనిషికి రెండుముఖాలు. గట్టిగా అడిగే ధైర్యం ఆయనకి లేదు. కులతత్వాలకి అతీతుడనుకోవాలి ప్రజలు. అడక్కుండా ఉండలేరు. తన కులంవాడుకాకపోతే ఉద్యోగం ఇవ్వరు. అంతవరకు న్యాయం. "మంచిచెడ్డలు రెండూకలిసే అన్నారు కదూ ఎవరో! మరి నామంచివిడిచి నేను చెప్పకో కూడదు" అన్నాడు నవ్వుతూ. కార్యదర్శి ముఖం చిట్లించుకున్నాడు. అలా చిట్లించుకుంటాడని విశ్వానికి తెలుసు. ఆయనకి నచ్చే సమాధానం తనదగ్గిరుంటే సూటిగా చెప్పేవాడేనని కార్యదర్శి ఊహ! అలాంటి ఆఫీసులో ఉద్యోగంఇచ్చినా తన కక్కర్లేదు. అయినా తనకి కనపడనివ్వకుండా ఏవో ఒకటిరెండు విషయాలు మాట్లాడి ఇంటర్వ్యూ ముగిస్తూ "వెళ్లిరండి" అన్నాడు కార్యదర్శి

"ఫలితం ఎప్పుడు తెలియచేస్తారు?"

"పోస్టులో తరవాత పంపిస్తాం- సెలెక్టయితే"

వెళ్లాడు విశ్వం. ఆ తరవాత కుతూహలంకొద్దీ ఆఫీసులో విచారిస్తే ఆ ఖాళీ భర్తీఅయిందని తెలిసింది. కొత్త ఉద్యోగి కార్యదర్శిగారి స్వకులస్థుడేట! బి.ఏ తప్పాడట!

విశ్వం ఓగది అద్దెకు తీసుకుని ప్రతిఆఫీసు తిరగసాగాడు. ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజిలో పేరు నమోదు చేయించుకున్నాడు. కనీసం లోయర్ డివిజన్ గుమాస్తా అయినాసరేనని ఆఫీసర్ గారితో చెప్పాడు. ఒక ఆఫీసులో ఉద్యోగం వచ్చినట్టే వచ్చి పోయింది. పొద్దునవచ్చి పనిలో చేరమని అధికారంగా చెప్పాడు మేనేజర్. ఇంటికి ఉత్తరంకూడా రాసేశాడు ఉద్యోగం వచ్చిందని. కాని ఉదయం ఆఫీసుకి వెళ్లేసరికి మేనేజర్ తన విచారం తెలియచేశాడు. కొన్ని పరిస్థితులవల్ల ఆ ఉద్యోగం మరొకరికి అకస్మాత్తుగా ఇవ్వవలసొచ్చిందని చెప్పాడు. కాళ్లీడ్చుకుంటూ నిరాశతో వెళ్ళిపోయాడు విశ్వం.

ఇంటినుంచి తెచ్చిన డబ్బు అయిపోవచ్చింది. ఉద్యోగంవచ్చే ఆశ ఏమీ లేదు. తిరిగి ఇంటికి వెళ్ళటానికి అతని అభిమానం అడ్డొచ్చింది. ఏ ఉద్యోగమైనా-సరే చేరటం మంచిదట! పూటగడిచేది ఏదైనా సరే తను చేరదలచుకున్నాడు. కాని ఆశలన్నీ అడియాసలౌతున్నాయి. కాఫీ మానేశాడు. టిఫిన్ మానేశాడు. భోజనంలో పెరుగు మానేశాడు. తరవాత ఒకపూట భోజనం మానేశాడు. ఏదో ఒక టిఫిన్ భోజనం బదులు తినటం చేసేవాడు. తరవాత రెండుపూటలు అలాగే చేశాడు

అర్ధాకలివల్లా, నిరాశవల్లా పట్టుదల సడలజొచ్చింది. కాని అభిమానం ముంచుకొస్తోంది. ఏ ఉద్యోగమైనా సరే! ఆనర్స్ పాసైనట్లు ప్రొవిజనల్ సర్టిఫికేట్లు చేతిలో ఉంది. కనీసం తిండిపెట్టే స్తోమతు దానికి లేదా?

డబ్బు తగ్గిపోతున్నకొద్దీ దాని విలువ మరింత ఎక్కువైపోతోంది. ఒకపూటే టిఫిన తీసుకోసాగాడు.

భోజనం మొదలే లేదు. చివరికి ఆలోచించి అతి చౌక విధానం కనిపెట్టేశాడు బతకటానికి. అరటి పళ్లు!

“ఫరవాలేదు. అరటిపళ్లు బాగానే ఉంటాయి” అనిపించింది విశ్వానికి. చాలారోజుల తరవాత మొదటి సారిగా రుచిచూశాడు. తనకి అవి సహించేవి కావు పూర్వం. చక్కెర కేళీ అయితేనే తినేవాడు.

ఉన్నడబ్బయిపోయింతరవాత ఏం చేయాలో విశ్వానికి తోచలేదు. తక్కువ పనులు చెయ్యటానికి అతని మనస్కరించటంలేదు. రిక్షా లాగి కూలీ చేసు కోని బతకాలా? ఏం? కాని— ‘శరన్ ధ్రువాణి పశ్యతి!’ జీవించటానికేదో పనిచెయ్యాలి. అందులో గౌరవహాని ఏం లేదు. కాని తనదగుపు వృథా! అయినా పనిచెయ్యటానికి తను సిద్ధమే. కాని పని ఎవరిస్తారు? ఒకసారి బట్టల షాపులో తను కనుగొన్న కన్యక కళ్లలో మెదిలాడు. అతని రూపానికి తన రూపానికి ఇప్పుడంత తేడా ఏం లేదు. కష్టంచేసి ఎన్నాళ్ళో అయింది. లేదా పొట్ట చేతపట్టుకోవటమే! ఎనిమిది అరటిపళ్ళొస్తాయి.

తనమూర్తం తల్చినా విద్యమైన తను. అతని కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అనుకున్న వాళ్లని పాడు భూతితో చూశాడు. అభిమానం చంపుకుంటున్నాను, పాపం.

తను ఎన్నో పనులు చెయ్యదలచుకున్నాడు. కాని తనజీవితం ఇలాగే అంతమవుతుందేమో! ఇప్పుడు ఈ స్థితిలో వసంత తనని చూస్తే! ఏం చేస్తుందో! కన్నీటితో అభిషేకం చేసుందేమో!

తనని చూసి తను జాలిపడుతున్నాడు. అక స్మాత్తుగా ఉపనిషత్తుం గ్రహించాడు విశ్వం. ఇతరుల బాధలు చూసి జాలిపడటం మంచిగుణం. కాని తన మీద జాలి ఘోరం! మరుక్షణంలో విశ్వం ముఖంలో గాంభీర్యం వచ్చింది.

పండుకాంతులు విరజిమ్ముతోంది సూర్యబింబం. చూస్తున్నాడు తను. ఏదో ఒకపనిలో చేరతాడు. అది ఏదైనా సరే. దృఢనిశ్చయం అతని కళ్లలో మెరిసింది. ఏంచేసినా ఇక తనమీద తను జాలిపడడు. అనంత విశ్వంలో తనూ ఒకడు. తన బతుకుకోసం ఏదోవిధంగా ప్రయత్నించటం తన విధి. ఇన్నాళ్లూ తెలిసో తెలియని గౌరవం తనకి అపాదించుకున్నాడు. తను చదువుకున్నవాడు కావొచ్చు. అయితే చదువు పనికొచ్చే పరిస్థితి లేనప్పుడు తను విచారించాల్సిన అవసరమేమీ లేదు. తను కొంతవిజ్ఞానం సంపాదించు కున్నాడు. అది విజ్ఞానంకోసం. అంతే. అది ధనా ర్జనకి పనికిరాలేదని తనకి ఇంత కాలంకోసంగా ఉంటే వ్రాసివాడు తను! పరిస్థితులు తనతో ఆటచేస్తున్నా కూడా గుడ్డివాడై గమనించలేక కాలం వృథాచేశాడు!

విశ్వం అరటిపళ్లగుత్తింటివైపు నడిచాడు. నాలుగు అరటిపళ్లుకొని తినటమూలం పట్టాడు. పరాయి కనిపిస్తే ముంగిటిల్లో కాగాడు. రెండురో జులు వెయ్యగానే అకస్మాత్తుగా నీరసం ఆవహించింది. ఎన్నాళ్లనించో అరటిపళ్లమీద బతుకుతున్నాడు. అవి కడుపునిండా తను తినలేదు. తిన్నా సరిపడదు. కాపేపు కూర్చుని మళ్లీ లేచినిలుచున్నాడు. కళ్లు గిర్రున తిరిగాయి. ఎదురుగుండా రిక్షా వస్తోంది. పక్కకి తప్పుకుంటూ కూలిపడిపోయాడు. రిక్షాలో కూర్చునివున్న స్త్రీ అదృశ్యం చూసింది. రిక్షా ఆగింది. రిక్షావాలా విశ్వం ముఖం మీద నీళ్లు జల్లాడు. విశ్వం తెప్పరిల్లి కళ్లు తెరిచాడు. “ఎవరో ముసలాడు కాబోలు పాపం. ఎన్నాళ్లనించి తిండి లేదో! ఇదిగో ఈ రూపాయి అతని చేతిలో పెట్టు” రూపాయి నోటు రిక్షావాలాకి అందించిందామె. అతడు విశ్వాని కివ్వబోయాడు.

“నేను అనుకున్నట్టే వాడిని కాదు!” విషాదంగా హీనస్వరంతో అన్నాడు విశ్వం.

“మీ రెవరు? ఇలా పడిపోయారేం?” అం దామె అనునయంగా, తనుచేసిన పొరపాటుకి చింతిస్తూ.

“నేను ఆనర్స్ గ్రాడ్యుయేటుని, కవిని చిత్ర కారుణ్ణి” అంటూ ఆమె ముఖంలోకి చూశాడు విశ్వం. అతని ముఖం వివర్ణమైంది. ఆశ్చర్యంతో “వసంతా!” అన్నాడు. ఆ పిలుపుకి వసంత అప్రతిభురా లైంది. పరకాయించి చూసింది విశ్వాన్ని. సంభ్రమా శ్చర్యాలతో దగిరికొచ్చింది.

“విశ్వా బావా! ఏమిటిదంతా?” ఆమె కంఠం గద్గదికమైంది.

విశ్వం ఏమీ అనలేదు. నెమ్మదిగా లేచి నుంచు న్నాడు. కింద అరటిపళ్ళు పడివున్నాయి. వాటిని తీసుకోవాలని ప్రయత్నించి ఓపికలేక మానేశాడు.

“మాట్లాడవేం బావా?” అంది వసంత అతనివైపు జాలిగా చూస్తూ.

రాల్లో కల్పించుకోను. కాని అతని పరిస్థితులు మరీ విషమించేటట్లున్నాయి, ఏదో చెయ్యాలని పథకం కట్టాడు. చూస్తూ ఎలా ఊరుకోను? ఒంటరిగా ఏం చేస్తాడు! ఇద్దరం కలిసి ఒక అభ్యర్థిని పోటీనించి విరమింపచేయాలని ప్రయత్నించాం. ఇద్దరికీ మా మీద అనుమానం ఏర్పడ్డది. మే మేదో మూడో పార్టీ పెట్టి ఊరు మావైపు తిప్పుకోవాలని చూస్తున్నామని వాళ్లూహించారు "

"మన విదేశాంగ విధానంలా ఉంది నీకథ"

"చివర మారిందిలే విను మరి మూడో పోటీదారు వచ్చాడనుకునే సరికి వాళ్లిద్దరూ ఏకమయ్యారు ఇద్దరూ కలిసి ఏదో సంప్రదించుకున్నారు పోటీ తప్పిపోయింది కక్షలు తగ్గిపోయాయి అంటే నా ప్రయత్నం సఫలమైందన్నమాట నాకెపుడో సాఫల్యం జరుగుతుందని తెలుసులే '

"శుభం కాని దెబ్బల సంగతేమిటయ్యా మహా ప్రభూ!"

"అదే సన్మానం కావాలని రెచ్చగొట్టానులే అయితే ఇంత పని జరుగుతుందని అనుకోలేదు ఏదో గాడిలో పోనిస్తారనుకున్నాను "

"నువ్వు చెప్పేది నాకేమీ అర్థం కావటం లేదు."

"అర్థం కావటేముంది? పోనీ ఇంకొంచెం విపులంగా చెబుతాను వాళ్ళు పోటీ విరమించుకోమని మంచిగా చెబితే వినలేదు వినరని ముందే తెలుసులే అందుకని ఈ మూడో పక్షం గురించి పుకార్లు లేవదీశాను అక్కడా అక్కడా వాళ్లని గురించి చెడో అన్నట్టు కల్పించాను దాంతో వాళ్లకి ఉద్రేకాలు పెరిగాయి ఏమయితే ఏం? ఊళ్లో పేచీలు తప్పిపోయాయి ప్రస్తుతానికి "

విశ్వం మూర్తివైపు ఆశ్చర్యంగా చూశాడు

"అయితే సాహసించి కావాలని అభాండాలు నెత్తిన వేసుకున్నావా?"

"మరి ఏం చెయ్యను? లేకపోతే ఆ ఊళ్లో బతకటం మరీ కష్టం. నీకు తెలుసుగా. గలాటాలంటే నాకు చెడ్డ తలనొప్పి "

"నిన్ను కొట్టినవాళ్ళెవరు?"

"ఎవరయితే ఏంలే "

"అదేమిటి? క్రిమినల్ కేసు పెట్టి జైల్లో వేయించి వాడి పాట్లు వాడికి కరపకుండా ఉంటారా?"

"నీకు తెలియదులే బావా ఈ గొడవంతా, ఆ కోర్టు గొడవలు లేకుండా చెయ్యటానికేదా ఇంత శ్రమా పడ్డది."

విశ్వం మూర్తివైపు అర్థం కానట్టుగా చూశాడు

"అయితే వాడిని వొదిలేసావా?"

"లేకపోతే వాడిమీద నాకు కక్షేమిటి? వాడిక ఎదురుగా వస్తే ఎడంచేత్తో కొంత కట్టుమీదికి విసిరెయ్యగలను బుద్ధి తక్కువ పని చేశానని లోలో మంటూ ఉంటాడీపాటికి "

"నీది గాంధీగారి పద్ధతిలా ఉంది "

"నాదేందతికాదు. అది నా స్వభావం అంతే,"

"సుజనపద్ధతి అంటారే."

"అదిగో, అదే నాకు నచ్చనిది నేను వాళ్లకో సహా, వీళ్లకో సహా ఏది చెయ్యలేదంటే నమ్మరేం? నాకో ఊరుంది ఆ ఊళ్ళో నేను జీవితం గడపాలంటే అందుకు తగిన వాతావరణం సాధ్యమైనంత వరకూ కల్పించుకోవాలి దీనికేమిటో పెద్ద పెత తరం! ఇంతా చేస్తే, ఈ మూడో పక్షం సంగతి ఆ ముసలిగారబ్బాయి టపాకాయలా పేల్చేస్తాడేమోనని భయంగా ఉంది ఎరక్కపోయి అతనికి చెప్పాను ఊళ్లో అప్పుడే ఏదో కుతంత్రం వచ్చిందని గుసగుసలుగా ఉందిట నాన్న చెప్పాడు అసలు ఈ మనుషులకి పొగడ్తలంటే మహా ఇష్టం "

గబగబ మాటాడటంతో మూర్తికి కొంచెం ఆయాసం వొచ్చింది. జానకి అతనిని మాట్లాడవద్దని హెచ్చరించింది.

విశ్వం మూర్తివైపు ప్రశంసాపాత్రంగా చూడసాగాడు. ఏదో పొగడ్తగా అనబోయినవాడల్లా మూర్తి అన్న చివరిమాటలు విని నోరు తెరవకుండా ఊరుకున్నాడు మూర్తిని తను చిన్నప్పటినించీ ఎరుగు. వాడింత ఘటికుడని తను అనుకోలేదు, తను వాడినించి నేర్చుకోవాలిసింది చాలా ఉంది!

మరి కాసేపటికి వెంకట్రామయ్యగారు వచ్చి "మీరిద్దరూ వెళ్ళి భోజనం చేసిరండి. నేను మీరొచ్చేదాకా మూర్తి దగ్గర ఉంటాను" అన్నారు.

# అంతర్వాహిని

జానకి, విశ్వం అప్పటి బయటికొచ్చారు దారంలో జానకి మరిదిగార్ని వెంకటపతి వృత్తాంతం తంతోసహా అంతా చెప్పింది విశ్వానికి అదంతా చాలా కొత్తగా ఉంది మరిది ప్రవర్తన నిజంగా అపూర్వం అనిపించిందతనికి తను మరిదిని పైచదువుకి వెళ్ళమని ప్రోత్సహించాడు, చదివితే మరి బాగుపడేవాడేమో వ్యక్తిగత అభ్యున్నతి దృష్ట్యా కాని ఊరు పాతకాలంలో లాగే ఉండేది

భోజనంచేసి పడక కుర్చీలో పడుకున్నాడు విశ్వం అతని మనసులో ఏవేవో ఆలోచనలు కదిలాయి. జానకి చాపమీద కూర్చుని ఏదో పనిచేసుకుంటోంది

ఆమెవైపు యథాలాపంగా చూశాడు విశ్వం ఆమె వదనంలో ప్రశాంతత తాండవిస్తోంది తనని దౌర్భాగ్యస్థితిలో చూసినప్పుడు ఆమె ముఖంలో ఎంత ఆవేదన ప్రస్ఫుటమైంది! పొంగి పొర్లే దుఃఖాన్ని ఆమె ఎంతంతాన అణుకుంటుంటే ఆ దుఃఖమంతా కన్నీరై చెంపమీదికి జారే దృశ్యం అతని మనోవీధిలో మెరిసింది అది విపరీత పరిస్థితే కావచ్చు; కాని తను కష్టంలో ఉంటే అంతగా ఆమె బాధపడాలిసిన అగత్యమేమిట?

అకస్మాత్తుగా విశ్వం భావవీధిలో ఏదో వెలుగు గోచరించింది జానకి తనని ప్రేమిస్తోందా? ఎలా ఈ విషయం తెలుసుకోవటం ఒక వేళ ఆమె తనని ప్రేమిస్తే జీవితంలో ఒక గొప్పసమస్య తను ఎదుర్కోవాలి. పరిస్థితులు ప్రతిఘటించకముందే నిజం తెలుసుకుని సమయోచితంగా ప్రవర్తించాలి సరాసరి ఈ ప్రశ్న జానకిని అడిగితే? ఆమె ఏమనుకుంటుందో! ఇప్పటికే ఒకసారి ఒకవ్యక్తి ఇచ్చిన చనువుదుర్వినియోగం చేసుకున్నాడు డొంక తిరుగుడుగా ఆమెచేత విషయం బయటపెట్టించాలి.

"జానకీ "

"ఏమిటి బావా?"

"వ్యక్తిలో ఎటువంటిగుణాలు నీకిష్టం?"

"మంచి గుణాలు." ఇదికూడా ఓ ప్రశ్నేనా అన్నట్టుగా జానకి సమాధానం చెప్పింది

"చెడుగుణాలుగల మనిషైతే?"

"బాధగా ఉంటుంది."

"అది సరే. అతనిపట్ల నీ ప్రవర్తన ఎలా ఉంటుంది?"

"ఇప్పుడెందుకా సంగతి?"

"కావాలి."

"ఆ సందర్భంలో కాని తెలియదు"

"నేను కూడా అలవాటుచేసుకుంటానేమో"

"వాడిని చివాట్లు పెడతాను"

"అంతేగాని ఇంకేం చెయ్యవా?"

"వీలైతే బాగుచెయ్యటానికి ప్రయత్నిస్తాను"

"కాకపోతే?"

"ఒక దణ్ణంపెట్టి ఊరుకుంటాను"

"అంతేగాని అసహ్యించుకోవా?"

"గుణాల్నిగాని మనుషుల్ని అసహ్యించుకోటం ఎందుకూ?"

"నీకొచ్చేబోయే భర్త అలా చేస్తేనేమో"

"చాల్లెద్దూ, వేళాకోళం" అంది జానకి చిరుకోపంతో విసుగ్గా

"కాదు జానకీ చెప్పు"

"అప్పుడేంచేస్తానో వొచ్చి చూద్దువుగానిలే"

ఆమెవంక పరిశీలనగా చూశాడు విశ్వం.

"రానిస్తావా?"

"పరాయివాడివైనట్టు మాట్లాడతావేం?"

"రానిచ్చినా ఇటువంటి సంగతులు చెబుతావేమిటే," ఆమెవంక దొంగతనంగా చూస్తూ అన్నాడతను. జానకి ఏమీ మాట్లాడలేదు

"ఊరికే అన్నాలే జానకీ, నీకు మంచి మొగుణ్ణి వెతికి పట్టుకొస్తాంగా"

"పనీపాటా లేకపోతేసరి" అంటూ జానకి లేచి వెళ్ళిపోయింది

"వెళ్లకు, వెళ్ళకు, నీకు పుణ్యముంటుంది, ఒక్క సలహా ఇవ్వు జానకీ"

"నాకు సలహాలివ్వటం రాదు"

"పోనీలే చూడు, మనిషి ఏదైనా ఒక మంచి పని చెయ్యాలని నీకనిపించదూ?"

"ఒకటేమిటి, చాలా చెయ్యాలి"

"కనీసం ఒక్కటి కొంచెం ఆలోచించి చెప్పు. నేనేంచేస్తే బాగుంటుందంటావు?"

"నీ ఇష్టంవచ్చింది చెయ్యి. నాకేం తెలుస్తుంది".

"మారిలా నాకూ అలా ఏదైనా మంచిపని చెయ్యాలని ఉంది"

"అన్నయ్య అలా చేశాడని ఎప్పుడూ చెప్పలేదే"

"అవును ఆ రోగం. సంఘాన్ని ఉద్ధరించేపని చేస్తే బావుండదూ?"

"నువ్వూ నేనూ ఒకర్ని ఉద్ధరించేదేమిటి లే బావా."

"అలా తీసి పుచ్చకుమరి పెళ్ళి విషయం మాట్లాడుకో కట్నం లేకుండా పెళ్ళిచేసుకోటమో, కులాంతరం చేసుకోటమో "

"రెండో పెళ్ళి చేసుకోకుండా ఉండటమో " జానకి నవ్వుతూ అంది.

"సాధ్యంకాదు సాంఘికదురాచారానికి బలి కాబోయే స్త్రీని పెళ్ళిచేసుకుంటే?"

"చేసుకో, మంచిదే" నిర్లిప్తంగా అందిజానకి

విశ్వం ఆమె ముఖంలోకి చూశాడు ఆమెలోని ఏ భావమూ ముఖంలో ప్రతిఫలించటం లేదు.

"జాగ్రత్తగా ఆలోచించి చెప్పు తేలాలాని అడగటం లేదు"

జానకి కొంచెం ఆలోచించింది

"ధైర్యం ఉంటే, మనసారా కోరితే చేసుకోటం మంచిదే బావా ఇందులో సలహా చెప్పటానికేముంది? అది కేవలం వ్యక్తిగత విషయం కదా!"

అంత తేలిగ్గా, ఏ భావమూ లేకుండా ఆమె అభిప్రాయం వెలిబుచ్చుతుందనుకోలేదు విశ్వం కాని ఆ సమాధానం అతనికి తృప్తినిచ్చింది. ఒక గడ్డు సమస్య ఎదుర్కొనవలసిన అవసరం తప్పింది.

"ముఖ్యంగా నా కెంతో అభిమానం జానకీ"

"చెప్పావా ఏమిటో?" అంది చిత్రంగా జానకి

"నీకు మంచి సంబంధం రావాలని, కూడు పుట్టాలా ఉను కాయలుగా, నిత్యకల్యాణం పచ్చతోరణంగా నువ్వు సంసార జీవితం గడపాలని నా కోరిక"

"నువ్వు మంచివాడివి బావా" అందామె.

"నేనంటే నీకు అభిమానమేగదూ జానకీ?"

ఆమెలో ఏ జ్ఞాపకాలు మెదిలాయో, కళ్ళు చెమ్మగిల్లాయి ఆ నీళ్ళు నిండిన కళ్ళతోనే విశ్వం వైపు ఒకసారి చూసింది విశ్వం హృదయం ఆర్ద్రమైంది

"ఏమిటి బావా, చాదస్తం! ముఖ్యంగా నాకభిమానం ఉండదూ?"

"ఎందుకుండాలి?" కావాలని తర్కించాడు విశ్వం

"బావని కనుక మంచివాడివి కనుక. ఇంకా- నేనంటే నీకభిమానం కనుక"

అంతేనా?"

"మరింకేముంటాయి కారణాలు? అయినా ఇవన్నీ నే చెప్పడమూ ఆలోచించలేను ఆలోచించను కూడా తీరిగ్గా కూచుని ఇలాంటి ప్రశ్నలడుగుతున్నావు లే. రేపు పెళ్ళయితే నూ ఆ ప్రయ్యని కూడా ఇలాగే అడుగుతావు కాబోలు" అని కలకల నవ్వుతూ జానకి అతనివైపు చూసింది

ఆ నవ్వులో నిర్మలంగా ప్రవహించు కలకలా, ఆ చూపులో ఆత్మీయత, స్నేహానురాగం భావాలూ దర్శించి పరవశించాడు విశ్వం స్త్రీపురుష భేదానికి ప్రాముఖ్యం లేని ఏదో పవిత్రమైన ఆత్మీయత రెండు హృదయాలని ఆవరించినట్లు అతను ఆ క్షణాన అనుభూతిపొందాడు.

సశేషం

గలిగే విదేశీ సాంకేతిక విజ్ఞాన నిపుణులను కూడా మనం అత్యధిక వ్యయప్రయాసలకోర్చి దిగుమతి చేసుకోవాలి. ఒక అణుశక్తి ఉత్పత్తి యంత్రాంగాన్ని మన దేశంలో సంపాదించాలంటే దాని కవసరమైన ప్రతివస్తువూ కూడా విదేశాలనుంచే రావాలి. అవేవీ కూడా మన దేశంలో ఇంకా ఉత్పత్తి కావటంలేదు. ఉత్పత్తి సాధకాలైన యంత్రాంగాన్ని ఎల్లకాలం మనం విదేశాలనుంచి దిగుమతి చేసుకోజాలం. ఈ ఉత్పత్తి సాధక యంత్రాంగాన్ని నిర్మించే ఉత్పాదకశక్తిని కూడా మనదేశంలో పెంపొందించుకోవాలి. ఒక దేశాన్ని పారిశ్రామిక దేశంగా మార్చాలంటే అన్నిటికన్నా ముందుగా విస్తృతమైన రవాణా సౌకర్య నిర్మాణం అవసరం. అందులో భారతదేశం అతివిశాలమైనది. బొగ్గుగను లొకచోట, ఇనుము ఉక్కుగను లొకచోట, యంత్రాంగం ఒక చోట, పెట్టుబడిదారు లొకచోట, ఎగుమతి దిగుమతులకు నౌకాకేంద్రా లొకచోట ఉన్నాయి. వీటన్నింటిని అత్యధునిక రవాణామార్గాలతో కలపడం సామాన్యమైనది కాదు. ఈ రవాణాయంత్రాంగానికి మనం సంపూర్ణంగా విదేశీ దిగుమతుల పైనే ఆధారపడవలసి వస్తోంది.

ఇంకొక విషయం కూడా ఇక్కడ అవిస్మరణీయమైనది. మనం విదేశాలనుండి కొనవలిసే వస్తుజాల పరిమాణం, మనం విదేశాల కమ్మవలిసే వస్తుజాల పరిమాణంపై ఆధారపడి ఉంటుంది. మనది బీదదేశం. విదేశీ అభిరుచులకు తగినట్లుగా మనం వస్తువులను తయారు చేయలేం. ఇక మన ఎగుమతులలో ముడిపదార్థాలే ఎక్కువ. ఇటీవల ఈ ముడిపదార్థాల విక్రయంలో కూడా మన దేశం వెనుకపడుతోంది. కొన్ని వస్తువులలో ప్రపంచ క్రయవిక్రయంలో భారతదేశం ఆధిపత్యం వహించింది. ఉదాహరణకు, జనపనార వస్తువులు, టీ మున్నగునవి. కాని నేడు ఆ వస్తువులు సహితం విదేశీయుల స్పర్థకు తట్టుకోలేకపోతున్నాయి. పాకిస్తాను జనపనార వర్తకంలో చాలా ముందంజ వేసింది. అదీకాక మన ఎగుమతులు వ్యావసాయికమైన వనపంటలవ వాని ఉత్పత్తి పరిమాణాలు మన అదుపులో ఉండవు. ఒక సంవత్సరం ఎక్కువ ఉత్పత్తి కావచ్చు. ఒక సంవత్సరం తక్కువ కావచ్చును.

1956 వ సంవత్సరంలో ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రారంభమైనాదాదిగా విదేశీమారకరంగంలో మనకన్ని అడ్డంకులే సంభవించసాగాయి. ఎన్నో అవాంతరాలు సంప్రాప్తిస్తాయని మనం ఊహించే ప్రణాళికాపథకాన్ని తయారుచేశాము. కాని మన మనుకున్న అవాంతరాలకు పరిష్కారమార్గాల నింకా రూపొందించుకోకపూర్వమే అనేకవిధాలైన నూతనసమస్య లుద్భవించి మన పథకాన్ని తారుమారు చేశాయి. ఈవిధంగా తారుమారౌతుందని ముందుగానే ఊహించి ప్రణాళికా పరిమాణాన్ని తగ్గించమని హెచ్చరించినవారు లేకపోలేదు. ప్రప్రథమంగా వారిలో పేర్కొనదగిన వ్యక్తి ఆచార్య బి ఆర్ షినాయ్. ఈయన 1956 లోనే, ఆర్థశాస్త్రజ్ఞుల సమితితో (Pannel of Economists) పూర్తిగా వ్యతిరేకించి, ప్రణాళికారచనలో వాస్తవికత లోపించరాదని ఉద్ఘాటించారు. అయితే అప్పట్లో ప్రథమ పంచవర్ష ప్రణాళికలో సంపూర్ణవిజయం సంపాదించామనే గర్వంతో (నిజానికి మనం సంపాదించిన విజయం అతి తాత్కాలికమైనది) ఆయన మాటలు ఎవరూ వినలేదు. క్రమంగా దిగుమతుల సంఖ్య అత్యధికమైపోవటం, ఎగుమతులు క్షీణించడం, విదేశాలనుంచి అనుకున్నంత సహాయం రాకపోవడం సంభవించి ఆ ఆర్థశాస్త్రజ్ఞుని మాటలను సత్యాంశాలుగా నిరూపించాయి. నేటికీ భారతప్రభుత్వం ప్రణాళికాసంకోచానికి, భారతదేశంలో ద్రవ్యోల్బణం అంతగా లేదని ప్రకటించడం ఎంతైనా హాస్యాస్పదంగా ఉంది. ఎంత జయుంకన్నా వాస్తవిక పరిస్థితులపట్ల అంధత్వం వహించరానిదై అవుతుంది.

ఇక ప్రణాళికారచనలో అంచనాలను పరిశీలించిన పిదప అవి ఏవిధంగా తారుమారయ్యాయో పరిశీలిద్దాం.

దిగుమతులు ఈ క్రిందివిధంగా అంచనా వేయబడ్డాయి. అయిదు సంవత్సరాలకు కలిపి మొత్తం దిగుమతులపై చేయబడవలసిన వ్యయం రూ 4,340 కోట్లు. అంటే సరాసరి సంవత్సరానికి ఎనిమిదివందల డెబ్భై కోట్ల రూపాయిలన్నమాట. ఈ ఖర్చులో ఎక్కువ భాగం, యంత్రాంగం, వాహనసౌకర్యాలు, ఇనుము ఉక్కులోహాలు, తైలములు మొదలయిన వానిపై వెచ్చింపబడుతుంది.

ఇక, ఎగుమతులు మొత్తం రూ 2,965 కోట్ల ఖరీదు కలవిగా అంచనా వేయబడ్డాయి. అంటే సరా

# విదేశద్రవ్యమారకరంగంలో విషమస్థితి

సరిని సంవత్సరానికి 198 కోట్ల రూపాయల విలువగల వస్తు సముదాయాన్ని భారతదేశం 1956-61 లో ఎగుమతి చేయగలదని ఊహింపబడింది. భారతదేశపు ఎగుమతులందు ముఖ్యవస్తువులు, టీ, జనపనార వస్తువులు, ప్రత్తి వస్తువులు. 1955వ సంవత్సరపు ఎగుమతులకన్న ఎక్కువ ఎగుమతి పరిమాణం, టీ, ప్రత్తివస్త్రములందు సాధ్యమౌతుందని భావింపబడింది. ఈ అధిక పరిమాణమైనా అంత చెప్పుకోదగినది కాదు. అది మాటికి ఇరవై పాళ్లు కంటే కూడా తక్కువే.

1956 61 ఎగుమతుల అంచనా

| వస్తువులు | ఎగుమతి పరిమాణం (1956-'61) |
|---|---|
| టీ | రూ. 635 కోట్లు |
| జనుము, వస్తువులు | 610 ,, |
| ప్రత్తి, వస్త్రములు | 375 ,, |
| తైలములు | 110 ,, |
| పొగాకు | 75 ,, |
| తోళ్ళు, చర్మం | 140 ,, |
| ముడిప్రత్తి, వేస్టు | 110 ,, |
| లోహ ఖనిజములు | 115 ,, |
| బొగ్గు, కోక్ | 25 ,, |
| రసాయనికములు, రంగులు | 35 ,, |
| ఇంజను వస్తువులు, విద్యుత్ప్రేరకములు | 20 ,, |
| ఇతరములు | 735 ,, |
| | రూ. 2,965 కోట్లు |

దిగుమతుల అంచనా (1956-61)

| వస్తువులు | దిగుమతి పరిమాణపు అంచనా (1956-'61) |
|---|---|
| యాంత్రిక సామగ్రి, రవాణా వాహనములు | రూ. 1500 కోట్లు |
| ఇనుము, ఉక్కు | ,, 480 ,, |
| ఇతర లోహములు | ,, 220 ,, |
| ధాన్యములు, దినుసులు, పిండి | ,, 240 ,, |
| చక్కెర | ,, 35 ,, |
| తైలములు | ,, 410 ,, |
| రసాయనిక మైన ఔషధములు | ,, 160 ,, |
| రంగు సామగ్రులు | ,, 85 ,, |
| కాగితం | ,, 55 ,, |
| లోహసామగ్రి, విద్యుత్ప్రేరకములు | ,, 145 ,, |
| ముడి ప్రత్తి | ,, 270 ,, |
| ముడి జనుము | ,, 90 ,, |
| ఇతరములు | ,, 700 ,, |
| | రూ. 4,340 కోట్లు |

ఎగుమతి, దిగుమతి వస్తువులు కాక విదేశీమారకపు రంగంలో వచ్చే అంశాలు మరికొన్ని ఉన్నాయి. ఉదాహరణకు పై దేశంనుంచి సాంకేతిక నిపుణులు మన దేశానికి వచ్చినప్పుడు వారిఖర్చు, వారి జీతములు విదేశీ ద్రవ్యంలో మనం చెల్లించాలి. అంతేకాక పై దేశాలనుండి మనం పుచ్చుకున్న ఋణాలపైన వడ్డీ కట్టాలి. ఈ లెక్కలలో భారతదేశానికి మిగులు వస్తుందని ప్రణాళికా రచయితలు భావించారు. అయిదు సంవత్సరాలకు కలిపి ఈరీతిగా లభించే మొత్తం 255 కోట్ల రూపాయలు కాగలదు. అంటే సరాసరిన సంవత్సరానికి 51 కోట్ల రూపాయలన్నమాట. పై అంచనాల ప్రకారం ఎగుమతుల విలువ 2,965 కోట్ల రూపాయలు, దిగుమతుల విలువ 4,340 కోట్ల రూపాయలు. మనకు అయిదు సంవత్సరాలలోను లభించగల విదేశీమారకపు ద్రవ్యం రూ. 2 965 కోట్లు + రూ. 255 కోట్లు = రూ. 3220 కోట్లు. మనం వినియోగించ వలసిన విదేశీమారకపుద్రవ్యం రూ. 4,340 కోట్లు. అంటే భర్తీ కావలసింది రూ. 1,120 కోట్ల రూపాయల విలువగల విదేశీమారకపు ద్రవ్యం. ఇంతపెద్ద మొత్తం భర్తీచేయడానికి ఈ క్రింది సూచనలను ప్రణాళికాసంఘం సూచించింది. వానిప్రకారం భారతదేశానికి లంపెమలోకల సంఖ్య దాపరికంనుండి రూ. 200 కోట్లు, ఇతర విధములుగా భారతదేశంలో పెట్టుబడి పెట్టేవారి మూలకంగా రూ. 100 కోట్లు రాగలవని భావింపబడింది. ఇక మిగిలిన రూ. 800 కోట్లు విదేశీ సహాయం మూలంగా లభించాలి. అమెరికా సంయుక్త రాష్ట్రములు ప్రథమ ప్రణాళికలో గోధుమ ఋణం మూలకంగా రూ. 90,31 లక్షలు, ఆంగ్లో, అమెరికా సహకార కార్యక్రమం మూలకంగా రూ. 102,55 లక్షలు, ఇచ్చింది. ఆ విధంగానే ఆస్ట్రేలియా, కెనడా, న్యూజిలాండు, నార్వే, బ్రిటన్, రష్యా, ఫోర్డుసంస్థ, ప్రపంచ బాంకు మున్నగునవి సహాయం చేశాయి. ఈ సహాయం కొంత ఋణ రూపకంగాను, కొంత దాన

రూపకంగాను జరిగింది. ఈ పెద్ద దేశాలు, విదేశీసంస్థలు, ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో కూడా ఇతోధికంగా సహాయం చూపి ఆ రూ 800 కోట్ల మారకపు ద్రవ్యాన్ని భర్తీ చేస్తాయని ప్రణాళికా రచయితలు ఆశించారు.

కాబట్టి ద్వితీయ పంచవర్షప్రణాళికా విజయం విదేశీ సహాయ్యంపై ఆధారపడి ఉంది. మొత్తం వ్యయ పరిమాణం రూ 4,800 కోట్లలోను, స్వయంకృషివలన 4 000 కోట్లను, రూ 800 కోట్లను విదేశీ సహాయం వలన సాధించగలిగితే భారతదేశం ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో సంపూర్ణవిజయం సాధించిఉండేదన్నమాట. అయితే రూ 800 కోట్ల విదేశీమారక ద్రవ్యాన్ని సంపాదించడం సులభసాధ్యమైన పని కాదు. ఏదో ఒక రాజకీయ పక్షంలో చేరనిది అంత పెద్ద మొత్తాన్ని భారతదేశానికి ఏ విదేశము కేవలం కానుకగా గాని, దీర్ఘకాలిక ఋణంగా గాని ఇవ్వరు. కాబట్టి ప్రణాళిక అంచనాలు సరిగా అనుకొన్నట్లు ఫలించినా కూడా రూ 800 కోట్ల విదేశీ సహాయం ఒక గడ్డుసమస్య అయి ఉండేది.

అయితే అంత మాత్రంతో కూడా ఆ సమస్య మనలను వదలలేదు. అది మరింత తీవ్రతర స్వరూపం ధరించి, ప్రణాళిక అంచనాలను తారుమారు చేసి, ప్రణాళికా విజయాన్నే ముప్పు పెట్టే మహాసమస్యగా మారింది. ఇదే నేడు భారతదేశం ఎదుర్కొంటున్న విదేశీమారకపు ద్రవ్యపు కొరతవలన ఏర్పడిన అతివిషమ పరిస్థితి. ఈ సమస్య ఏ విధంగా పరిణమిస్తుందోనని భారతీయులే కాక విదేశీయులు— శత్రువులు, మిత్రులు—కూడా ఎంతో ఆత్రంగా ఎదురుచూస్తున్నారు.

అయితే, విదేశీద్రవ్యపు కొరత అనుకున్న అంచనాల కన్న అత్యధికమై, ఈ సమస్య భావించినదానికన్న అత్యంత విషమ మవడానికి గల కారణాలను పరిశీలించాలి. ఏ ఒక్క కారణం ఈ అంచనాలను తారుమారుచేసి సమస్యను విషమతరం చెయ్యలేదు. అనేకములైన నూతన సమస్యలంకురించి ప్రణాళికా రచయితల ఊహలను వమ్ముచేసి విదేశీమారకపు ద్రవ్యపు లోటును అతివిస్తృతంచేసి సమస్యను మరింత అగాధం చేస్తాయి.

దిగుమతుల దృష్ట్యా తిలకిస్తే ప్రణాళికా రచయితలు ప్రథమంలో వేసిన అంచనాలకన్న అత్యధిక పరిమాణంకల దిగుమతులను మనం చేసికొనవలసి వచ్చింది. ఎక్కువ దిగుమతులు చేసుకున్నామంటే ఎక్కువ విదేశీ మారకపు ద్రవ్యపులోటు ఏర్పడిన దన్నమాట. అంచనా పరిమాణాల కన్న ఎక్కువ దిగుమతులు చేసికొనవలసిన అవసరం ఈ క్రింది కారణాలవలన సంభవించినది.

ప్రప్రథమంగా గణింపదగ్గది, అత్యధికమైన ఆహారపు కొరత. దేశంలో ఆహార స్వయంసమృద్ధి విషయంలో ప్రథమ పంచవర్షప్రణాళిక సాధించిన విజయం చాలా తాత్కాలికమైనది. ఆ విజయమైనా ప్రణాళికా కృషి ఫలిత మనేకంటె 1953—54 సంవత్సరాలలో భారతదేశం అనుభవించిన అనుకూలమైన ఋతుపవనముల ఫలితమనడం ఎక్కువ సమంజసమైన విషయం. కావున క్రమంగా అట్టి అనుకూల పవనాలు మార్పుచెంది ప్రతికూలంగామారడంతో ఆహారోత్పత్తి పరిమాణం తగ్గిపోయింది. 1956 - 57 లో కి ఆహారోత్పత్తి గిరాకీ ఎంతమాత్రం జరిపోలేదు. ఉత్తర ప్రదేశ్, బీహార్, మధ్యప్రదేశ్ మున్నగు రాష్ట్రాలలో అనుకున్న ఆహారోత్పత్తికన్న చాలాతక్కువ వచ్చింది. 1955-56 కన్న 1956-57 లో మొత్తం ఆహారోత్పత్తి 28 8% నుండి 24 8% కు పడిపోయింది.

ఈ విధంగా ఆహారోత్పత్తి తగ్గిపోయి విదేశాల నుండి అమితవ్యయంతో దిగుమతులు చేసుకోవడానికి అనేక కారణాలున్నాయి. ఆహారోత్పత్తి విచారణ సంఘం అధ్యక్షుడు శ్రీ అశోకమెహతా (Food grain Enquiry Committee report) వివరించిన కారణం ముఖ్యంగా పరిశీలింపదగినది. ఈయన భావన ప్రకారం, ఒక దీర్ఘకాలంలో ఆహారపదార్థాలకు గిరాకీ ఎక్కువ కావడంవల్ల ధరలు పెరుగుతాయి. కనక రైతులు ఆ పదార్థాల అమ్మకం ఎక్కువ చెయ్యక, పైగా ఇదివరకటికన్న తగ్గిస్తారు కూడా. ఈయన వాదం బహిరంగంగా కొంత అపహాస్యంగా కనబడవచ్చు కాని అది సహజాతిసహజమైనది. గిరాకీ పెరగడంవలన ధరలు పెరుగుతాయి. ధరలు పెరగడంతో, పూర్వం విక్రయిస్తున్న పరిమాణంకన్న తక్కువ పరిమాణానికే పూర్వపు ఆదాయం రైతు పొందగలుగుతాడు. అంత వరకు సరియైన ఆహారాన్ని భుజించడానికి తగిన

అనాంతరం సంభవించి ఎగుమతి వర్తకానికి గొడ్డలి పెట్టైంది. అలాగే ప్రత్తి వస్త్రములద్వారా మంచి రాబడి ఉంటుందని అంచనా వేశారు గాని దీనిలో కూడా భారతదేశం నష్టాన్ని ఎదుర్కొనవలసి వచ్చింది. విదేశాలలో పోటీ పెరగటంతో తద్వారా లభించే మారకపు ద్రవ్యం తగ్గిపోయింది. జపాను దేశాలేకాక చైనా నుండి కూడా వస్త్రపరిశ్రమలో భారతదేశానికి స్పర్థ సంభవించింది. ఇంతేకాక ఆ కాలంలో సంభవించిన ఆర్థికమాంద్య ఫలితంగా భారతదేశపు టీ ఎగుమతులకు నష్టం సంభవించింది.

అంచనాలకన్నా ఎగుమతులు తగ్గిపోవడానికి మరొక మూలకారణం ప్రపంచ ధరలతో పోల్చిచూస్తే భారతదేశపు ధరలు భారతదేశపు నూతన పారిశ్రామిక వైవిధ్యంవలన అధికము కావటం. దీనితో విదేశీయులు భారతదేశంలో అధికమైన ధరలకు దిగుమతి చేసుకోవడం మాని ధరలు తక్కువగానున్న ఇతర దేశాలనుండి దిగుమతి చేసుకుంటున్నారు. దీనితో మన ఎగుమతులు పడిపోయాయి.

ఈ విధంగా ఎగుమతులు తగ్గిపోవటం దిగుమతులు అంచనాలను మించి అత్యధికం కావటంతో విదేశీ మారక ద్రవ్యం తీవ్రసంకోచం పొంది ఆ సమస్య విషమతరం అయింది. ఇంతేకాక అంతర్జాతీయ వాణిజ్యరంగంలో లెక్కకువచ్చే ఇతరములు—వడ్డీలు, అప్పులు, బహుమతులు, విద్యార్థి వేతనాలు, యాంత్రిక వ్యయాలు—మున్నగు వానియందు కూడా భారతదేశం అనుకున్నంత లాభాన్ని పొందలేకపోతోంది.

ఈ పైకారణాలవలన ప్రణాళికా రచనలో ఒక సమస్యగా భావించబడిన విదేశీమారకద్రవ్యపు లోటు, ప్రణాళిక ఆచరణలోనికి వచ్చేసరికి తీవ్రతర స్వరూపం ధరించి అంతుచిక్కని అభేద్య సమస్యగా రూపొందింది.

అయితే ఈ సమస్యతో పూర్తిగా నిరాశచెంది ద్వితీయ పంచవర్ష ప్రణాళికను త్యజింప నక్కరలేదు. సమస్య లంకురించినప్పుడే పరిష్కార మార్గాలు జనిస్తాయి. కొన్ని సమస్యలకు పరిష్కారమార్గాలు అత్యంత కష్టసాధ్యములైననైతే కొన్ని సమస్యల పరిష్కార మార్గాలు సులభ సాధ్యములు కావచ్చు. ఈ సమస్య పరిష్కారం మన జాతి దీక్షపైన, మన ఆర్థిక శాస్త్రజ్ఞుల మేధాశక్తిపైన, మన రాజకీయనేతల అంతర్జాతీయ విఖ్యాతిపైన ఆధారపడి ఉంటుంది. కష్టనష్టాల నెదుర్కొనకుండా చరిత్రలో ఏ దేశం ఆర్థిక పురోగమనాన్ని సాధింపలేదు. ఏ దేశమైనా ముప్ఫై నలభై సంవత్సరాలలోనే ఆర్థికరంగంలో పాశ్చాత్యదేశాలను తలదన్న గలిగే అభ్యున్నతిని సాధింప గలిగినదంటే, అది ఆ ప్రజల మాతృదేశభక్తిపైనా ఆ దేశపు ఆర్థిక విధానాలపైనా ఆధారపడటం వల్లనే. జపాన్ పూర్వుల బాట ద్వారా అభ్యున్నతి సాధింపలేదు. ఏ దేశానికైనా ఆర్థిక పురోగమనపథం దుర్గమమైనదే. కాని తత్ఫలితం ఆ దేశపు దీక్షపైనే ఆధారపడి ఉంటుంది.

ఈ కఠినసమస్యకు రెండు ప్రధాన పరిష్కార మార్గాలున్నాయి. మొదటిది ఎగుమతుల పరిమాణాన్ని అధికం చేయటం, రెండవది: దిగుమతుల పరిమాణాన్ని సాధ్యమైనంతవరకు తగ్గించటం. విదేశీ సహాయాన్ని పొందటం మూడవ పరిష్కార మార్గం. ఈ త్రిమార్గాలగుండా భారత ప్రభుత్వం నిరవధికంగా కృషి చేస్తోంది.

ఎగుమతుల నధికం చేయడానికి ఉపాయాన్ని సూచిస్తూ కేంద్రమంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి వస్తువులను విదేశీయులకు తక్కువ ధరలకు, మన దేశపు గిరాకీదారులకు హెచ్చు ధరకు విక్రయించాలని చెప్పారు. తక్కువ ధరలు ప్రదర్శించటం ద్వారా విదేశీయుల గిరాకీని ఆకర్షింపవచ్చును. తక్కువ ధరల మూలంగా సంభవింప గలిగే నష్టాన్ని మన దేశస్థుల కెక్కువ ధరల కావస్తువును విక్రయించడం ద్వారా సరిపెట్టుకోవచ్చు. దీనికి పూర్వం జపాన్ దేశం ఇండియా వాణిజ్యరంగంలో బ్రిటన్ను జయించి, ఆధిపత్యం సంపాదించడానికి ఇదే విధానాన్ని అవలంబించింది. దీన్ని ఆంగ్లంలో డంపింగ్ (dumping) అని వ్యవహరిస్తారు. ఈ విధానాన్నవలంబించడం ద్వారా ఎగుమతులను పెంచవచ్చును కాని ధరల తగ్గింపు వలన విదేశీయుల అభిరుచులని మార్చలేం. తరువాత స్పర్థ (Competetion) తీవ్రమైనదైతే విదేశీయులు కూడా ఈ విధానాన్నే అవలంబించి అనభిలషణీయమైన పరిస్థితులకు దారి తీయవచ్చును. కాబట్టి ఈ విధమైన పద్ధతిని అవలంబించే ముందు తగు జాగ్రత్తలు తీసుకోవాలి.

# విదేశద్రవ్యమారకరంగంలో విషమస్థితి

ప్రభుత్వం వివిధవస్తువుల ఎగుమతుల నధికం చేయడానికి ఆయా వస్తువులకు ఎగుమతి సంఘాలను నియమించింది. ఇటువంటి సంఘాలలో (Export promotion councils) అతి నూతనమైనది ఆట వస్తువుల ఎగుమతి వృద్ధికి కృషి చేసే సంఘం (Sports goods export promotion council). దీనిని యూనియన్ మంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి జూలై ౩౦వ తేదీన ప్రారంభించారు. ఈ సంఘ సభ్యులు ఆయా వస్తువులకు విదేశాలలో గిరాకీ కల్పించడానికి కృషి చేస్తూ చాలవరకు కృతకృత్యులవుతున్నారు.

ఎగుమతులను ప్రోత్సహించడానికి భారత ప్రభుత్వం అనేక వస్తువులపై కంట్రోళ్ళను తొలగించింది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికా విజయంకొరకు ఈ విధంగా సుమారు 200 ఎగుమతి వస్తువులపై ఆంక్షలు తొలగించబడినాయి. అంతేకాక అవసరమైనచోట పన్నులను తగ్గించడం, ఎగుమతి సుంకాలను తీసివేయడం, సబ్సిడీ నొసగి ప్రోత్సహించడం మున్నగు అనేక పనులను భారత ప్రభుత్వం చేస్తోంది. ఇటువంటి ప్రోత్సాహం ప్రత్యేకంగా పైకి వస్తూన్న ఎగుమతి దారులచే ముందంజవేయించి విదేశీ స్పర్ధను ఎదుర్కొనజేస్తూన్న ఎగుమతి దారకు ధైర్యం కలిగిస్తుందనడం నిస్సంశయాంశం.

ఎగుమతులను అనేకవిధాలుగా ప్రోత్సహించడం వలన మారక ద్రవ్యసంపాదనే గాక ఉత్పాదన కూడా పెరగగలదు. అధికమైన ఎగుమతులవల్ల ప్రణాళికా విజయం చేకూరుతుంది. ఎగుమతులు ఇటువంటి కాలంలో వెనకే దిగజారిపోతే పరిస్థితి మరింత విషమిస్తుంది.

ఇక రెండవ పరిష్కారమార్గం దిగుమతులను సాధ్యమైనంతవరకు తగ్గించడం. దిగుమతుల పరిమాణాన్ని తగ్గించేముందు ప్రధానంగా భారతదేశం చేసుకొంటూన్న దిగుమతులను విలాస వస్తువులు, అవసర వస్తువులుగా విభజన చేసి సామాన్య ప్రజా సౌభాగ్యానికి అడ్డు తగలని విలాస వస్తువుల దిగుమతి నిషేధించడంగాని తగ్గించడంగాని చేయాలి. భారత ప్రభుత్వం తరచుగా అనేక వస్తువులపై ఆంక్షలు విధించి దిగుమతులను తగ్గించింది. కాని పై విభజన అంతగా పాటింపబడలేదనే చెప్పాలి. అత్యవసర వస్తువులైన మందులు, రసాయనిక ఔషధాలు, బ్లేడ్లు, పిల్లల ఆరోగ్యాన్ని కాపాడే పాల్సన్స్, ఓవల్ టైన్, పిండిపాలు మున్నగువాటిపై ఆంక్షలు విధించడం దేశానికంత క్షేమకరం కాదు. వీటికి సరియైన దేశీయ వస్తువులు ఇంకా ఉత్పత్తి అవడంలేదు. పిల్లల కవసరమైన పాలడబ్బాలను విలాస వస్తువులుగా గ్రహించి నిషేధించిన ప్రభుత్వ విధానం అంత ప్రశంసనీయమైనది కాదు. కొన్ని విలాస వస్తువులను సంపూర్ణంగా నిషేధించడంవలన దేశంలో ఏ కొద్ది మందికో తక్క మిగిలిన వారికి అంత ఇబ్బంది కలుగదు. ఉదాహరణానికి టాయిలెట్ సామాన్లు, కాస్ట్లీ పెన్నులు, ఖరీదైన లేసు దారాలు మొదలయిన వాటిని ప్రభుత్వం సంపూర్ణంగా నిషేధించాలి. విదేశీ రేడియోలను, అతిఖరీదైన విదేశీ వస్త్రాలను సంపూర్ణంగా నిషేధించడంవలన సామాన్య ప్రజ అంత వంత చెందదు.

కాని దిగుమతి నిషేధవిధానాన్ని అనేకులు అనేక విధాలుగా విమర్శించారు. అవన్నీ పూర్తిగా సత్యదూరాలు కావు. ఆచార్య బి. ఆర్. షెనాయ్ మున్నగువారు, ఈ నిషేధంవలన వ్యక్తి స్వాతంత్ర్యం దెబ్బతింటుందని, భారతదేశం వంటి ప్రజాస్వామిక దేశంలో ప్రభుత్వం ఇట్టి పనులు చేయడం ప్రజాభిప్రాయవిరుద్ధమని వాదించారు. ఈ వాదం సత్యమే అయినప్పటికీ, దేశ సంక్షేమం కోసం ఇట్టి నిషేధాలను తాత్కాలికంగా విధించినా అంత అవభిలషణీయమైన పరిస్థితులేర్పడవు. అయితే ఈ నిషేధం కేవలం తాత్కాలికమయేట్లు మాత్రం తగు జాగ్రత్త వహించాలి. రెండవ విమర్శ ఏమంటే విదేశవస్తునిషేధం వలన దేశీయ వాణిజ్య రంగంలో గుత్తోత్పత్తిదారులకు ఆధిపత్యం కలిగి ప్రశస్తమైన వస్తువుల ఉత్పత్తి లేకపోవచ్చును. స్పర్ధ లేకపోవడంతో చౌకబారు వస్తువులే అతి ఖరీదైన ధరలకు అంగడిలో ప్రత్యక్షమవడం మనం నేడు చూస్తున్నాం. కాని ఈ దోషం కూడా, నిషేధం తాత్కాలిక మవడంవలన, తాత్కాలికమే అవుతుంది. మనం విదేశీ దిగుమతులను నిషేధించడం వలన, మన ఎగుమతులను విదేశీయులు బహిష్కరింపవచ్చును. కాని ఈ విమర్శ సహేతుకమైనది కాదు. ఈ నిషేధం కేవలం భారతదేశ ఆర్థిక పురోగమనమునకే అవటంవలన ఇతర దేశాలు మన ఎగుమతులను బహిష్కరింపవు.

దిగుమతి నిషేధంవలన గత ఒకటిన్నర వత్సరాల లోను, భారతదేశం చెప్పుకోదగినంత విదేశ మారకపు

# మొగలి పువ్వు

శ్రీనివాసరావు బయలుదేరాడు గానీ, సంచీ పుచ్చుకొని రాధతో వాదించి ప్రయోజనం లేదు... అసలు ఎవరుమాత్రం యీ విషయంలో తనతో ఏకీభవిస్తారు? నిజంగానే, ఒక్క పూవు పస్తుంటే ఏం పుట్టిమునుగుతుందో! బాగా ఆకలివేసి రెండో పూట అన్నం రుచిస్తుంది, అంతేగా! కానీ, ఒక్క పూట పస్తుండిపోతే ఏదో అవమానం, ఎంతో మేర ఘోరంగా దిగజారినట్లు "అయ్యో! తిండానికి లేక పస్తున్నాం!!" ఆ మాటలో ఏదో పెద్ద దిగులు! "పిల్లలు కడుపులు వెన్నంటుకుపోయి అలమటిస్తుంటే కళ్లతో చూశాం తల్లీ దండ్రీ యిద్దరూ బ్రతికి వుండేం!" అని ఏడుపు, తిట్టుకోటం, ఏదో మహా ఘోరం జరిగిపోయినట్లే బాధపడటం. ఇక తర్వాత, తర్వాత—"ఫలానా కాలం, బియ్యం లేక, అని చెప్పుకోటానికి చిన్నతనంలేక, పస్తుపడివున్నాం" అంటూ జీవితచరిత్రలో ప్రధానఘట్టం కింద చిత్రించుకోటం.

ఈ గోలంతా ఒక్క పూట తిండి కరువుకి!! కో-ఆపరేటివ్ జూనియర్ ఇన్‌స్పెక్టర్ చేస్తున్న మానవుడి జీవితంలో యిలాంటివెన్ని మలుపులో!

శ్రీనివాసరావు హెడ్ క్లార్క్ రామనాధం గారి దగ్గరకువెళ్దాం అనుకుంటూంటేనే పిలిచాడు కృష్ణమూర్తి — 'ఏం, శ్రీనివాసులూ! మొగ్గపాలెం నించి ఎప్పుడొచ్చావ్? ఈ బస్సుకేనా? మొగలి రేకులు తెచ్చావా? మా పెదమ్మాయి పరదా పడుతూందోయ్! 'ఇగ్గో మామయ్య క్యాంపునుంచి వస్తాడు, తెస్తాడు లేవే' అన్నాను"

తూలసంచీ సైకిలుకు తగిలించుకొని, ముఖం మీద జలపాతం లా ప్రవహిస్తున్న చెమట తుడుచుకొంటూ, మా పెళ్ళాల మొగలిపూల కోసం లేని బాంధవ్యాన్ని నొక్కిచెప్తూ, నవ్వుతూ, ఆశగా నిల్చున్నాడు కృష్ణమూర్తి.

"నా దగ్గర డబ్బు లేదు, తీసుకురాలేకపోయ్! ముందే చెప్పరాదూ!"

కృష్ణమూర్తి ముందే చెప్పితే డబ్బు ఇచ్చుకోవాల్సి వస్తుందేమోనని!

"కరణానికి చెప్పలేకపోయావ్? బంట్రోతు గాడ్ని పురమాయించేవాడు"

"వాటి విషయం అనుకోలేదు. ఇంటరెస్టు లేదు. సరే, బ్రదర్! ఒక అయిదు రూపాయలు కావాలి అర్జంటుగా. బియ్యం తీసుకెళ్ళాలి యింటికి."

కృష్ణమూర్తి ముఖంలో నవ్వు మాయమైంది "సారీ బ్రదర్! ఇవ్వాళే ఇరవై మూడో తారీఖు అని మరిచిపోయావు కాబోలు! మనం అంతా ఒక బోటు లోనే ప్రయాణం!" అంటూ సైకిలెక్కి రివ్వున మాయమయ్యాడు.

శ్రీనివాసరావు రామనాధంగారి యిల్లు చేరుకునే టప్పటికి ఆయన భోజనానికి కూర్చున్నాడని తెలిసింది. వరండాలో నిల్చున్నాడు శ్రీనివాసరావు. చెమట పోస్తూ చాలచికాగ్గా వుంది. బస్సులో రద్దీ. ఇద్దరు లావుపాటి మనుష్యులమధ్య బస్సు కుదుపులకు బాగా నలిగిపోయాడు. తలనిండా, ఒంటినిండా దుమ్ము. చెమటతో కలిసివగర్చుకుపోయి తుడుచుకోటానికి ప్రయత్నించినప్పుడల్లా, అసహ్యంగా వుంటోంది. బస్సు దిగి వెళ్లగానే స్నానం చేసి, మంచంమీద వాలుదామనుకొన్నాడు ప్రయాణంలో వున్నంత సేపూ. కాని ఆ యోగం పట్టలేదు. మెల్లగా నడి నెత్తికెక్కుతున్న సూర్యుడు రామనాధంగారి వరాండాలో నిల్చుంటున్నా, దహిస్తూ, బట్టల్ని చీల్చి చివరికి తనకి నమస్కారం చేస్తున్నాడు.

అసహ్యంవించే కాన్వెస్‌పట్టీలో నించి పత్తి పుట్టడు రాలటం గమనించాడు శ్రీనివాసరావు. అప్రయత్నంగా ఎండిపోయిన పెదవులు నాలుకతో తడుపుకొంటూ ఎదురుగుండా వున్న యింటి కిటికీవైపు చూశాడు. కిటికీ తలుపు ఓరవేసుకుని రెండు కళ్లు తనవైపు కేంద్రీకృతమై వుండటం తెలిసింది—ముఖం మీద చెమట తుడుచుకొని, జుట్టు కాస్త సవరించుకొని ఠీవిగా నిల్చుందామనిపించి, చెయ్యి జేబురుమాలు కోసం పంట్లాం జేబులోకి వెళ్ళింది కిటాలున. కాని మళ్ళీ అక్కడే జేబులోనే ఆగిపోయింది. నిర్లిప్తంగా శ్రీనివాసరావు తన దృష్టి రోడ్డువైపు మళ్ళించాడు. కుక్కలు రెండు పరస్పరం వాసన చూసుకుంటూ వయ్యారంగా తిరుగుతున్నాయి!

శ్రీనివాసరావుకు పెద్ద విసుగు పుట్టుకొచ్చి అక్కడినుంచి వెళ్ళిపోదామనుకున్నాడు. ఏం, వట్టి చేతుల్తో యింటికి వెళ్తే ఏం? రాధ మొత్తుకోటం, పిల్లల గోల అంతేకన్న ప్రమాదం ఏమీ జరగబోదు కదా! వరండా మెట్లొకటి దిగబోయాడు వెళిపోవాలని శ్రీనివాసరావు. కాని, రామనాధంగారు తలుపు తెరిచి లోపలికి రమ్మని పిల్చారు. సరే, తప్పదు!

దాపమీద పిల్లిలా పడుకున్న తర్వాత నక్షత్రాలకేసి చూస్తూ ప్రశ్నించుకున్నాడు—"రెండు పట్టాలమీద నడుకు వేదప్పుడు?" "ఎప్పుడో ఒకసారి, విసవది! దానికి కొంత ప్రయత్నించాలి!" అని జవాబు వచ్చింది

శ్రీమతి మెట్లెక్కి వచ్చింది దగ్గరగ వచ్చి "ఏమండీ, నడించమంటారా?" అన్నది మొగలిపువ్వు పరిమళం తెర శ్రీనివాసరావును ఉక్కిరి బిక్కిరి చేసింది.

"ఎక్కడివి మొగలిరేకులు?"

"పక్కింటావిడ ఇచ్చింది ఏం, నచ్చిందనా, లేక యింకా ఆలస్యంవుందా? లేవండి! తర్వాత వచ్చి పడుకుందురుగాని!"

"ఊఁ కానీయి," రాధ క్రిందికి వెళ్లిపోయింది

శ్రీనివాసరావుకు జ్ఞాపకం వచ్చింది నక్షత్రాలు, ఆకాశం, మొగలిరేకులవాసనా, గాజుల గలగలా, చిక్కనిచీకటి, వద్దని కౌగిలి సుజాత, మొగల్లిపాలెం ప్రైమరీస్కూలుటీచరు రైలు ప్రమాదంలో చనిపోయింది

ఆదర్శవాది, నీతి బద్ధుడుగా తిరిక్కుడున్నాడు?, రెండేళ్ల క్రితం సుజాతతో ప్రణయం అది అవినీతి, రాఘవు అన్యాయం మెలకువతో కాపాడుకోవలసిన రహస్యం కాబట్టి ఒక్కొక్కసారి ఒక మహత్తరమైన అనుభవం సుజాత తనగాణి చేసుకుంది భయపడ్డాడు, బాధపడ్డాడు కాలంప్రవహించి తిరిగివచ్చిన ప్రతి పర్యాయం పశ్చాత్తాప పడ్డాడు కాని, సుజాతను చూడగానే భయమూ బాధా, పశ్చాత్తాపమూ, పాపమూ, అన్నీ అంతర్థానమయ్యేవి! ఎంత మంచిది సుజాత! ఆమె కోరిన ప్రతిఫలం ఏమీ లేదు ఒకసారి, 'బాగుంటుంద'నుకొని, పదిహేను రూపాయలు పెట్టి పికానుచీర కొనక తీసుకువెళ్లితే ఏడ్చింది... తర్వాత నెల తిరక్కుండానే, సుజాత లేదు!

"ఏం నండోయ్, మిమ్మల్నే! ఎంతసేపూ రాగమిటే?"

ప్రత్యక్షమవటంగా ఉన్నప్పుడు భయమూ బాధా కలిగించినా దానిమూలంగానే ఆ రహస్యంతర్లే మొగలిపువ్వు వాసన, నక్షత్రాలు, ఆకాశం ఆనందం దానితో పాటు తనూ వుంటాడు!

# ఛాయా సంవాదము

శ్రీ బొడ్డు బాపిరాజు

వరుడు

ఓయి, నా వెంట బడక వేంచేయుమోయి.
నీకు పుణ్యమ్ము నా తోడ రాకయున్న
ఒక్క నిమిషమ్ము నిలిచి నిట్టూర్పు కొనక
విడువు మేకాంతముగ నన్ను, వేడుకొందు!

ఇన్నాళ్లున్ నిను వెంటబెట్టుకొని యూరేగించితిన్, నేడు నీ
వన్నన్ కత్తులమీది సామయిన, దేలా నన్ను వేధించుచున్
వెన్నాడంగ? చిరంతనంబయిన యానేస్తంబు పాటించి నీ
డొక్కన్నన్ దీపము పెట్టి నిన్ దలచి పేర్కొందున్ దయాసింధువున్

ఛాయ

తల్లి యుదరమ్మునుండి భూతలముమీద
అడుగుమోపని మొదలు నీయడుగుజాడ
విడక కొలిచిన అగ్రజన్ముడను నేను
నేడు తెగ్రెంచినన్ ముడివీడి పోదు!

పసితనపుం దువాళముల, భవ్యకళా కమనీయ సాహితీ
వ్యసనములందు, జవ్వనపువాలు మెరుంగుల కోరమీసముల్
మినమినలాడునప్డు, డవినీత జరాపరిరంభ వేళలన్
విసుగక తోడునీడవయి నిన్ను భజించు ఫలంబు లిట్టివే?

వరుడు

మానిని యన్నవెన్క ఒకమాటును మర్మము లేక యుండ, ద
వ్వాని మొకందలో పసిడిపాన్పుల నిద్దురవోని కోర్కులన్
తానయి తీర్చుకోవలయు దారులు గోప్యము, తెట్టిచాటు వి
య్యానకు తోటిపెండ్లికొడుకై చనుదెంతువు, దుర్భరమ్మురా!

అలసెన్ నా బ్రదుకెల్ల నీ తగులమాయానంబుగా,—కామినీ
లలితాశ్లేషసుఖానుభోగములు—మిత్రశ్రేణి సల్లాప వా
క్సులభావంద మధుక్షణమ్ములు—కృతిస్తోమాను సంధాన ని
స్తుల నిర్వేలసుధామహూర్తములు నీతో దక్కలేవయ్యెలే!

కలదట' తల్లికైన మరుగన్నది, రెండవ కంటి వానికిన్
తెలియగరాని, వాత్మగత దేవరహస్యము తెల్ల తీర్చుకో
వలె నిను చంకబెట్టుకొని, పాయని ఈ తగులం బశాంతికి
న్నిలవయి, వర్షపుంబడగ నీడల కాపురమట్లు వేచెడిన్.

వేవురిలోన 'మంచి'దనిపించెదులే వయి తళ్కుపూత, నీ
జీవిత—'మాపసిండివగిపే తెరచాటున దాగియున్న దు
ర్భావభయానకమ్ము అసిపత్రవనమ్మను నీవెరింగి యు
న్నా'వని గుండెలో మనలు నాకు సుఖమ్ముగ నిద్రపట్టునా?

ఛాయ

నావలన కాదు భయమిది,
నీ వరిగడు డొంకత్రోవ నిను వెరపించున్.
కేవల మనుచరుడను న
న్నీ విధమున దుయ్యబట్ట నేమగునయ్యా?

ఆపదలందు, సంపదలయందు, సుఖమ్ముల, రోగశయ్యలన్
ప్రాపులనుండి పాలుగొను నాప్తుడ, ఆపయి నాలుబిడ్డలున్
తిపులు చెల్లుబెట్టకొని నిన్ను చితాగ్నుల కిచ్చునాడు నిన్
జూపక చెల్మిమై విడువనొల్లని నాయెడనా కృతఘ్నతల్?

బ్రతుకు వైకుంఠపాళి నీపావు గెలిచి
నిచ్చెనలనెక్క నందరు మెచ్చుకొంద్రు,
పాములకు జిక్కి దిగజారి పడెడు వేళ
నిన్ను కనిపెట్టుకొని యుండు నేనొకండ!

కులమర్యాదలు గాలికిన్ వదలి, పోకుల్ పెంచి, గొంతెమ్మకో
ర్కులు పండించుకొనంగడంగి పెడదారుల్ ద్రొక్క, వల్లించు నీ
తలకున్ మావక చేయుచేతలకు నీ దోబూచులన్ జూచియు
'న్వలదన్నా,' యని ఒక్కనాడయిన నేవారింపనే లేదుగా!

వేసితి పేకమేడలకు పెల్లలు. శోకపుకంటిమూనలో
పోసివెలార్చు నీ సొగసుబొమ్మ, వసల్ సివసైన మూర్తివిన్
త్రాసున తూచి వాటితలలన్ ధరకట్టుట ఎంతసేపు? నీ
వేసము లన్నియుం దెలిసి వెంబడి వచ్చెద మూకసాక్షినై.

## ఛాయా సంవాదము

### నరుడు

నిండిన వేయి లాభములు నీవలనన్ మరి—యొంచి చెడ్డలం
బొందనకుండజూడ? వని కోప యామగనిడింట నుండినన్
దండునసున్న నొక్కటె కదా? చనుమన్నను చూరుబట్టి వ్రేల్
దుండగ మేలనోయి, కలదో బలవంతపు బ్రాహ్మణార్థమున్!

ప్రతిపద భయాన్వితమ్ము జీవితపథమ్ము
దుస్సహము చేసివైచె నీ తోడి పొత్తు
చాలు! వదలించి భవదీయ సాహచర్య
శృంఖలాబంధనము, దయచేయు మింక.

### ఛాయ

అంభోధి నమృతంబు హాలహాలము భంగి
నీలోన కనరాక నెలవు కొనుచు
ప్రబలంబులై పరస్పరజిగీష నజస్ర
మలయక మంచి చెడ్డలును రెండు
దేవదానవుల రీతిని కలహింపగా
దివురు, వివేకాగ్ని నివురుగప్పి,
పెడదారులకు పోయి పుడమి కన్నులు మూయు
నెరవులో బ్రదుకె దుర్భరముగాక

నీవు నిన్ను శంకించుచున్నావు గాక
హానిలేదోయి నావల్ల—వ్యాధి యొకటి
మందొకటి యైన నయమౌనె? ముందు నీవు
చక్కబడినంత అంతయు చక్కబడును!

జీతము బత్తె మివ్వని దినీ! కొలువేమిటి నాకు? ఇట్టి నం
గాతము తీర్చికూర్చె మనకావిధి, నేపగవాడగాను, నీ
చేతల కీడునీల్గు జమచేయగవచ్చిన కర్మసాక్షి నో
యీ, తగవేల మేలితెరువెంచి చరించి సుఖించు మీవయిన్

సన్నెరిగి కన్ను తెరచిన
అన్నరునకు కాన్గితోవ నడుగుపడునె? నా
సన్నిధి సుకృతమ్ములకున్
పెన్నిధి యని తెలిసి బ్రతుకు వెలిగింపుమురా!

